# ద్ద బొబ్బిలి రాజు కథ






# అత్యద్భుత మాయాజాల మర్మశాస్త్రము

కర్త: మంత్ర విద్యాప్రవీణ శ్రీ కృష్ణ

(సుమారు 40 చిత్రములతో కూడినది)

ఇది అత్యద్భుత గ్రంథరాజము. ఇట్టిది యిదివరకు వెలువడలేదు. మంత్రశాస్త్రము, పాశ్చాత్యదేశములలో ఎక్కువ ప్రచారముగల మెస్మరిజమునకు సంబంధించిన అనేక ఉద్గ్రంథముల ఆధారంతో ఇది వ్రాయబడినది.

ఈ పుస్తకములోని విషయములు సంభ్రమాశ్చర్యములను గలిగించును. దీని సహాయముతో ఐంద్రజాలికులు తమ విద్యను అభివృద్ధి చేసికొనవచ్చును. ఇతరులు ఈ శాస్త్రము నభ్యసించి ప్రదర్శన లిచ్చి తమ మిత్రులను సంతోషపరచవచ్చును లేక ఈ విద్యను వృత్తిగ జేసికొని ధనార్జన చేయవచ్చును. ఇంద్రజాల, మహేంద్రజాలములకు సంబంధించిన అనేక విషయములు తేటతెనుగున వివరింపబడినది. హస్తలాఘవము, దృష్టిప్రసరణములతో చేయదగిన జాలములు, తంత్ర, మంత్ర, యంత్ర, తైల, అంజనముల సహాయముతో ప్రదర్శించదగిన జాలములు, సుమారు రెండువేలకు పైగ వ్రాయబడినది. 420 పేజీలు గ్రంథము.

విషయములు కొన్ని: ఏనుగతలను అంతరిక్షమున నిలుపుట, పాములు, తేళ్ళు మున్నగు విషజంతువులను అప్పటికప్పుడు సృష్టించుట, గచ్చకాయల యుద్ధము, వశ్యవిధానము, కుక్కను సింహము చేయుట, మండుచున్న దీప మగునట్లు చేయుట, బీడు నేలలో నందనోద్యానవనము సృష్టించుట, నీరునిండిన తటాకము నెండజేయుట, నిప్పులేకనే అన్నము వండుట, సింహ, శార్దూలములను ఎప్పటికప్పుడు సృష్టించుట, కనుకట్టు విద్యలు ఇటువంటి మహాద్భుత జాలములు విదేశములలో ప్రచారములోగల ఎన్నియో ఇంద్రజాలములు గలవు. వెల 4-0-0

సి. వి. కృష్ణా బుక్ డిపో, తపాలుపెట్టె నెం. 1315 మదరాసు-1

శ్రీ ర స్తు

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# పెద్దబొబ్బిలిరాజుకథ

ఎస్. టి. రాజయ్యచే వచనం వ్రాయబడినది





ప్రకాశకులు:

## సి.వి.కృష్ణా బుక్‌డిపో

19/99. అమ్మన్ కోవిల్ వీధి,
వాల్‌టాక్సు రోడ్డు పోస్టు, మదరాసు.1.



దీనివెల] 1956 [1-0-0

# బొబ్బిలిరాజుకథ



Design REGD;

సి.వి.కృష్ణా బుకడిపో, మదరాసు

శ్రీ ర స్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పెద్దబొబ్బిలిరాజు కథ

—:*:—

క॥ శ్రీకర రామరామవర భీకర దీనదయాళ దానవదమనా ।
సాగరమైన పాపముల సామిదిదీర్పు రామచంద్రకా ॥

శ్రీగణనాథుని పాదముల్ చెలువుగ సేవించి
శ్రీకరపద్మజురాణికి సొంపుగ నేమ్రొక్కెదన్
ముందుగ హరిహర దాసుని ముద్దుగ సేవించి
పంతములేక గౌరీవాణుల పాదము సేవించి
వరకవులగు పెద్దలకు వందన మొసగిదా
వరుసతో బొబ్బిలిరాజుకథ వగతో జెప్పెదను ॥

కథా ప్రారంభము

వ. ఈ భరతఖండంబున ఆంధ్రదేశమందు విజయనగరమను పట్టణమేలుచున్న రాజశ్రీ రామరాజుగారికిన్ని పై దేశమున బొబ్బిలి అను పేరు వహించిన పురమునకు అధిపతియగు రాజశ్రీ రంగారావు గారికిని కొళ్ళ మాత్సర్యముచే జరిగిన ప్రక్రియకలహము.

బొబ్బిలికోట పాలించెటివాడు రంగాదొరగారూ
విజయనగరము పాలించెటివాడు విజయరామరాజు
పేరుపొందిన సరదారయ్యా ప్రభువు రంగారావు
నీతులయందున విదురునిలాగు నింపుగలవారయ్యా
వీపుయందున వింజామరలుంది రంగారాయుడికి
అరిపాదంబున దామరిరేఖ రంగారాయుడికి
రాజచిహ్నాలు గలిగినవాడయ్యా రంగారాయుడు
వస్తాదిబిడ్డగా యున్నాడయ్యా రంగారాయుడు
రంగారాయుడు తమ్ముడు వెంగళరాయుడు
కార్యమనగా ముందుకువత్తుడు వెంగళరాయుడు

వెంగళరాయుడు బావమరిది పాపారాయుడు
పాపారాయుడని పేరుజెప్పగానే
పాపలందరు పాలు త్రాగలేరు
పోరులేకనే యున్నారయ్యా బొబ్బిలికోటాలో
కోటలకంతయు కోరుసింహము పాపారాయుడు
బొబ్బిలికోట యేలుతున్నాడు రంగారాయుడు
యెదురులేకనే బొబ్బిలికోట యేలుతువున్నాడు

వ. బొబ్బిలిరాజుగారికి అరికాలుయందు పద్మరేఖయు, చేతుల కమలదళంబును, వీపున వింజామరలును, కన్నుల మచ్చయు, కపోలమున కనకమణియు, గలిగిన విదురునివలె నీతిమంతుడై యెదురులేని శౌర్యము గలిగి పరాక్రముండగు వెంగళరాయుండనే తమ్మునితో నతని బావమరిది యగు పాపారాయుడును తన బావమరిదియగు ధర్మారాయుండును గూడి శౌర్యములు మీరి యుద్ధములు గోర బొబ్బిలి యందు నివసించుచున్న వారలు,

విజయనగరము యేలెటివాడు విజయరామరాజు
కిరీటధారలయ్యా విజయరామరాజు
ఆలోచనలో దొడ్డవారయ్యా విజయరామరాజు
వొక్కదినమున వొక్కసమయంబున విజయరామరాజు
తన్నుకొలిచెడి రాజులంతయు తానుపిలిచినాడు
అన్నలార తమ్ములారా నాయన్నలార రండు
భూమియందున గొప్పపందెము మేముయాడితిమి
కోడిపందెము కోరవైయున్నది అన్నలార యిపుడు
కోడిపందెము ఆడనుయిపుడు మనసుపుట్టెనయ్యా
పేరుజెందిన సరదారిపందెము కోడిపందెమయ్యా
నాతోసరిగ కోడిపందెము యెవ్వరాడు రారు
యీలాగున ఆలోచించెను విజయరామరాజు
అచ్చోటనే యున్నాడయ్యా ఆనందరాజు
అప్పుడేమని చెప్పినాడయ్యా ఆనందరాజు
చిన్నమనవి చిత్తగింపుము పిన్నయ్యదొరగారు
బొబ్బిలియందు వున్నాడయ్యా వెంగళరాయుడు
మీతోసరిగా పందెములాడు వెంగళరాయుడు
యిట్టిమాటలు చెప్పినాడయ్యా ఆనందరాజు

అప్పుడేమని జెప్పినాదయ్యా విజయరామరాజు
వెంగళరాయుడికి జాబును వ్రాయసాగెనయ్యా

వ. ఇట్లుండగ విజయనగర మేలేవాడు విజయరామరాజుగారు తొమ్మిదిలక్షల సైన్యములతో రత్న కిరీటములతో సొదాసోపాన సింహాసనములతో పచ్చల తోరణములతో ఆలోచన సభలతో నిండు కొలువుండు నొక్కనాడు సమీపమునయున్న సేనాపతులం గాంచి మంచి పందెము మించిన జయము వహించితిమి కోళ్ళ పందె మునుచూడ ఆశించియున్నాడను నాతో సమానముగ పందెమాడు వారెవరని యడిగిన ఆనందరాజు చేతులు ముకుళించి శిరముపై నిడి ఓ స్వామీ! బొబ్బిలియందును వెంగళరాయుండను రాజు తమతో తమబలంబున పందెములు నొప్పునని జెప్పిన మాత్రమున సంతుష్టి జెంది వెంటనే జాబువ్రాయ నుద్యుక్తుడాయెను.

పరాకుంచక వినండిమీరు వెంగళరాయుడా
చిన్నమనవిదా చిత్తగింపుము వెంగళరాయుడా
కోడిపందెము యాడను యిప్పుడు యిచ్చలుగొన్నాను
కోడిపందెము ఆడుతానయ్యా వెంగళరాయుడా
విజయనగరము బొబ్బిలి యెల్లసందున యిపుడుదా
డేరాలుయిచట వేయించవలెను వెంగళరాయుడా
గురువారమందె వచ్చెదమేము యెల్లసదరుకుదా
చుట్టుప్రక్కల కోళ్ళనురాజా తయారు చేసుకొని
గురువారమందు చేరవలెనయ్యా యెల్లసదరుకుదా
నాతాలూకా యందుండు కోళ్లంతను దెప్పించుతాను
కోడిపందెము ఆడిమనము తమాషజూస్తామూ
మీరు గెలిచితే కీర్తిపేరు మీకేగలుగూను
మేము గెలిచితే కీర్తిపేరు మాకేగలుగూను
ముందువెనుక చూడవద్దయ్యా వెంగళరాయుడా
యిందుకుజాబులు వ్రాయుము వెంగళరాయుడా
యిారీతిగా వ్రాసినాదయ్యా జాబులు అపుడుదా
లకోటచేత బంధించినాడు రాజు యపుడుదా
హర్కారులచేత యపుడు యిచ్చెను జాబును
జాబుయిపుడు బొబ్బిలికి చేరవలెనయ్యా
రంగారాయుడు వెంగళరాయుడు చేతికివ్వండి

మరలు_త్తరవు కొనిరండయ్యా హర్కారులుమీరు

వ. బొబ్బిలిదొరయగు వెంగళరావుగారికి వ్రాయునది యేమ నగా, కోడిపందెము లాడుటకై మా పురము వెలుపల డేరాలు వేయించియున్నాను మాపరమునవున్న చుట్టుపట్టు జమీనుల కోళ్ల నున్ను తెప్పించుచున్నాము అట్టి తాము తమ చుట్టుపట్లనున్న కోడీలను బృహస్పతివారము వుదయంబున తప్పక వచ్చి కోళ్లపందె ముల తమాషాల చూచి కీర్తులు వహించెదముగాన అవశ్యముగ రాకోరెదను అని జాబువ్రాసి హర్కారుల చేతికిచ్చి జదులు తెమ్మని బొబ్బిలికి పంపెను.

జాబులెత్తుకొని వస్తున్నారు హర్కారులయితేను
బొబ్బిలివారి దేవిడికాడికి టంకాయైనారు
బారాహద్దున నిలచినారయ్యా హర్కారు లపుడుదా
యెవ్వరియొక్క పారాయన్నారు పారాచౌకీలు
రాజగారి తాలూకాని వారుజెప్పినారు
రాజగారి జాబులుమేము తెచ్చివున్నాము
పారాలయ్యా బాటలువిడవండి మేముపోవుటకు
వెంగళరాయుడు బేటికిపోయి హుకుమ తెస్తాము
గడియసేపుదా నిదానించండి హర్కారులుమీరు
యచటనుండి వచ్చినారయ్యా పారాచౌకీలు
రంగారాయుడు ముందుగవచ్చి వందన మొసగిరి
పరాకు లేక వినుమూ యిపుడు రంగయ్యదొరగారు
మీదుపేరిట జాబులుయిపుడే దేవిడికొచ్చేను
రమ్మని చెప్పితే పంపెదనయ్యా రంగాదొరగారు
పంపమని యపుడు సెలవిచ్చెను రంగారాయుడు
యచటనుండి వచ్చినారయ్యా పారాచౌకీలు
రంగారాయుడి బేటిచూడను వస్తావున్నారు
రంగారాయుడు ముందువచ్చి నిలచినాడయ్యా
వందనమయ్యా వందనమయ్యా రంగయ్యదొరగారు
వందన మొసగి జాబులుపెట్టిరి కొలువున యపుడుదా

వ. అంత హర్కారులు జాబునెత్తుకొని కోటవాకిట నిలచి రంగారావుగారూ వు_త్తరవుపొంది లోపలికి బోయి రంగారావుగారికి నమస్కరించి వు_త్తరము చేతికిచ్చి నిలిచిరి.

లకోటచింపి జాబుచదివినారు రంగారావుదా
జాబునవుండు సంగతులంతా కన్నుల చూచేను
తనలోతాను నవ్వుచున్నాడు రంగయ్యదొరగారు
వెంగళరాయుని ముఖముజూచి నవ్వసాగేను
పరాకుంచక వినుమా యిపుడు వెంగళరాయుడా
మీపేరటనే జాబులు వ్రాసినారు రాజుగారు
జాబునవుండు సంగతులంతయు కన్నులచూడండి
యిట్లుచెప్పతూ జాబునుయిచ్చేను చేతికియిపుడూదా
జాబునుయపుడు కన్నులజూచేను వెంగళరాయుండు
వుత్తరంయపుడు వ్రాయసాగేను వెంగళరాయుండు
పరాకుంచక వినండియిపుడు విజయరామరాజా
మీరుపంపిన జాబువచ్చేను మాకు యిపుడూదా
జాబునవుండు సంగతులంత కన్నుల చూచినాము
గురువారమే వస్తున్నాము మన్నెంమీదికి
మన్నెంమీదికి మీరురావలెను రాజులు దొరలంతా
ఇన్నివిధములుగ వ్రాసినారయ్యా జాబులో యపుడుదా
జాబువ్రాసిదా హర్కారుల చేతిలో యపుడు యిచ్చేను
జాబులెత్తుకొని వస్తున్నారు హర్కారులపుడుదా
జాబులేనయని తీసినాడయ్యా విజయరామరాజు
తిన తాలూకాకు జాబులుయపుడు వ్రాస్తుయున్నాడు
డబ్బైరెండు పాళెగాండ్లకు జాబులు వ్రాసేను

వ. రంగారావుగారు జాబు విచ్చిచూచి వెంగళరాజు వద్దికొచ్చి వాండొరులు చిరునవ్వు నవ్వుకొనుచు వెంగళ రాజుగారు బదులుత్తరము వ్రాస్తు యేమనగా, రాజరాజశ్రీ విజయరామరాజుగారికి వ్రాయునది తాము వ్రాసిన జాబుజూచినాము మీ యిష్టప్రకారం మన్నెంమీదికి మా కోళ్ళను మాతో జేరినవారి చుట్టుపట్ల కోళ్లతో గురువారము పురయమునవచ్చి చేరుచున్నాము అని బదులుత్తరము వ్రాసియిచ్చిరి. ఆ జాబునెత్తుకొని హర్కారులు విజయరామరాజుగారికి వినయవందనములు జేసి జాబు చేతికిచ్చి నిలిచిరి.

బొబ్బిలివారిపై కోడిపందెమునకు పోతూవున్నాము
రాజువలంతయు రావలెనయ్యా కోడిపందెమునకు
వింతవింత లకుకోడీలు టాబుకు తెన్నండి

యీలాగు వ్రాసినాడయ్యా జాబులు యపుడుదా
మంచివన్నెల కోడీలయంతా బట్టుతువున్నరూ
శుద్ధమైన కోళ్ళను యపుడు తయారుచేసిరీ
డేగవన్నెపు కోళ్ళను యపుడు తయారు జేసిరీ
మంచిమంచి కోళ్ళను తయారు జేసిరీయపుడు
విజయనగరము తెచ్చినారు కోళ్ళను యపుడుదా
యెటువప్రక్కచూచిన కోళ్లువున్నది అపుడై తేను
కలకలని నవ్వినాడయ్యా విజయరామరాజు
మంచిమంచి కోళ్ళనుయపుడు తయారుజేస్తిమి
తామసమేమి మన్నెంమీదికి తయారుగరన్నండి
యీవిధంబుగా పలికినాడు రాణువలంతాను
యీరీతిగా వున్నాడయ్యా విజయనగరమందూ
బొబ్బిలియందు యెట్లున్నాడు రంగయ్యదొరగారు
తనతాలూకాకుజాబులుయపుడు వ్రాయిస్తున్నారు

వ. అపుడు విజయరామరాజుగారు లకోటలిచ్చి జూచి చుట్టు ప్రక్కలనున్న పొరుగూరులనుంచి వన్నెలకోడిలతో తయారుగరమ్మని ఆజ్ఞాపింగగానే వారు జగడమున తయారుగ పెద్దకోళ్ళతో విజయ నగరం మన్నెంమీదికి రాగానే రాజుగారుజూచి తయారై యుండిరి.

దబ్బైరెండు పుణ్యాదారులకు జాబులువ్రాసిరి
అన్నలార తమ్ములార మాయన్నలార యిపుడు
కోడిపందెము వొప్పిమేము పోతూవున్నాము
కోడిపందెమునకు రావలెనయ్యా యెల్లాదొరలుదా
మంచిమంచి కోడిలంతా తయారుచేసుకోని
విన్నవేగము యందరు యిపుడు చేటికిరన్నండి
హర్కారుల యపుడు బిలిచెనయ్యా చేటికిముందుగా
జాబుయెత్తిగా చేతికిచ్చె రంగయ్యదొరగారు
హర్కారులపుడు జాబులెత్తి నడవసాగిరి
వారివారి జాబులు యపుడు వారికి యిచ్చిరి
జాబులుచూచి సంతోషపడ్డారు యల్లాదొరలుదా
మంచిదన్నారు బాగన్నారు రాణువలంతానూ
వింతవింత కోళ్ళనూ యపుడు బట్టుతున్నారు
పేరుయెత్తిన కోళ్ళనూ యపుడు బట్టుతున్నారు

కోళ్ళనంతయు తయారుజేసిరి యెలమాదొరలుదా
వెంకళరాయుడు చేటికివచ్చి పందెన మొనగిరీ
ఆజ్ఞప్రకారము కోళ్ళను యిపుడు తయారుచేస్తిమీ
మంచిమంచి కోళ్ళను యిపుడు తయారుజేస్తిమీ
తామసమేమి మన్నెంమీదికి త్వరలో రన్నండీ
యీలాగున జెప్పినారయ్యా రాణువలంతానూ
మంచిదన్నాడు అప్పుడామాట వెంకళరాయుడు
కాసాకోళ్ళను తెమ్మన్నాడు వెంకళరాయుడు
సాదరీకోళ్ళను తెమ్మన్నాడు వెంకళరాయాడు
కోళ్ళను యప్పుడు శృంగారించెను వెంకళరాయుడు
బంగారుతో అందెలుయపుడు వేసెను కోళ్లకు

వ. బొబ్బిలియందు రంగారావుగారు హర్కారులను పిలిచి డెబ్బదియేడు పాళయములకు జాబులుయిచ్చి పల్లెలకును జాబులు యిచ్చి పందెమునకు జయమునొందిన మంచి పన్నకోళ్లతో వేగ రమ్మని ఆజ్ఞపంపెను అంత వెలమ దొరలందరు సంతోషమున పేరు వహించిన కోడిలనుబట్టి వెంకళరాయుని యెదుట నిలిపి నమస్కరించి శీఘ్రముగా మన్నెంమీదికి రమ్మని పిలిచిరి.

సొగసయినట్టి పట్టుకుచ్చులు గట్టెను కోళ్లకు
ఈ రీతిగా శృంగారించెను కోళ్లకు యపుడుదూదా
పస్తాదుకోళ్లను తయారుచేసెను వెంకళరాయుడు
కోడిపుంజుల తయారుజేసెను వెంకళరాయాడూ
అన్నగారి చేటికివచ్చెను వెంకళరాయాడూ
పరాకుంచక వినండిమీరు రంగయ్యదొరగారూ
తామసమేమి మన్నెంమీదికి తయారుగ రన్నండి
ఈ రీతిగా చెప్పినాడయ్యా వెంకళరాయాడూ
మంచిదన్నాను అట్టివేళలో రంగయ్యదొరగారూ
బావమరిదిని పిలిపించినాడు యట్టివేళాలో
పాపారాయుణ్ని పిలిపించినాడు యట్టివేళాలో
అన్నతమ్ములు బావమరదులు యంతరు వెడలిరి
వారివారి రాణువలంతయు వెంటనే వెడలిరి
పరాకుంచక వినండిమీరు పాపారాయాడా
యింత తామస మేమన్నారు పాపారాయాడూ

అక్కడనుంచి ప్రయాణమైరి రంగయ్యాదొరగారూ
తన్ను గొలిచెటి రాణువలంతయు వెంటనె వెడలిరి
విజయనగరము మెల్ల సడరుకే పయనమైనారు
మెల్ల సడరుకు వచ్చిచేరిరి బొబ్బిలి దొరలూదా
డేరాయపుడు వేసినాడయ్యా వెంగళరాయూడు
డేరాలోపల కొలువుతీరిరి బొబ్బిలి దొరలూదా
అన్నతమ్ములు బావమరదులు కొలువుతీరినారూ
అచ్చట చలవపందిళ్లు వేసిరి కోళ్ళకు యపుడుదా
రాజువారి రాకలు యపుడు చూస్తువున్నారు

వ. నిలుపగానే వెంగళరాయుడు సంతోషించి కోళ్లను బంగారు అందెలు కట్టించి పట్టుకుచ్చులు వేయించి రంగయ్యా దొరగారయిన అన్నగారి సముఖమునకు వచ్చి శీఘ్రము తయారుగమ్మని వేడగా వారు బావమరిదియగు పాపారాయుణ్ని వెంటబెట్టుకొని తమ రాణువలంత గొలువగ యతి ఆర్భాటమున జయజయమని ఘోషలతో బొబ్బిలి దొరలు విజయనగరకోట మెల్లలో సరదారులంతా జేరి తమ్ముడు బావమరదులతో కొలువుతీరి డేరాలోదిగిరి.

యిక్కడి కథలు యీలాగున్నది మెల్లసడరులోనా
విజయరామరాజు వెడలెను అట్టి సమయమందూ
తన్ను గొలిచెడి రాణువలంతా అపుడు వెడలినారూ
బొబ్బిలివారి మెల్లసడరుకైనా దాకలయినారూ
రాజుగారి మెల్లయందు డేరావేసినారూ
కోళ్లకు యపుడు పందిళ్లయినా గొబ్బున వేసినారూ
కుర్చీవేసి కొలువుతీరెను విజయరామరాజు
డేరావిడిచి బయటికి వచ్చిరి బొబ్బిలి దొరలూద
రాజుగారును బొబ్బిలివారును బేటీయయినారూ
అక్కడ జోడుకుర్చీలు వేసినారు యపుడూ
కుర్చీమీద కొలువు తీరెను రంగయ్యాదొరగారూ
పచ్చల కుర్చీయందు కొలువుతీరెను వెంగళరాయూడు
రంగయ్యాదొరగారు రాజుగారున్ను కౌగలింపులాయెనూ
వెంబడివున్న యల్మాదొరలతో యేమని చెప్పేనూ
ముందుగ యిపుడు మీరేనయ్యా కోళ్ళదించండి
మంచిదన్నారు బాగన్నారు యల్మాదొరలూదా

ప్రొద్దుప్రొద్దున కోళ్ళను యపుడు దించుతున్నారు
మొత్తుడుకోళ్లు దింపుడుకోళ్ళు తయారుజేసిరి
కోడిపందెమునకు సెలవిచ్చినారు రంగయ్యదొరగారూ
రాజువారిని యపుడు జూచిరి రాణువలంతానూ
రాజుగారును సెలవుయిచ్చెను పందెమునకుదా
మంచి కోళ్ళను దింపించినారు సేవకులయితేను
వారివారి కోడీలను యపుడు కత్తులు కట్టిరి
కోళ్ళను విడిచిన యట్టివేళలో లడాయిపెట్టిరి
కిలకిలయని కొక్కరించెను కోడీలపుడూదా
యెగిరినాదిరా బొబ్బిలికోడి యోజన పొడుగూనా
యెగిరియెగిరి నెత్తియందు బాగుగ పొడిచెను
గిరగిరగిరమని భూమిన పడెను రాజుగారికోడి

వ. అక్కడ విజయరామరాజు తన సభయందున్న రాణువులను వెంటనిడుకొని కోళ్ళనెత్తుకొని బొబ్బిలివారుండు చోటునకువచ్చి యిరువురును కలసి మాట్లాడి సంతోషంబున పందెములు విడిచెదమని తలపెట్టి రాజుగారి కోడికిన్ని బొబ్బిలివారి కోడికిన్ని జగడమిడగ రాజుగారి కోడిని వోడించి బొబ్బిలి కోడి కూతవేస్తూయున్నది.

అప్పుడెట్లా వున్నాదయ్యా బొబ్బిలి కోడయితే
కాలుబిగువున పదికోళ్ళను యపుడు కాలున జంపేను
కొక్కరించి కూతవేసెను కోడీ యపుడూదా
కూతవేసి కోడీలమీదికి దూకుతు వున్నాదీ
యెక్కడ కోడీలను చేరనియ్యక తరుముతు వున్నాది
గాయముతగిలిన కోడీలకు యపుడు కత్తులిప్పారు
రెండవతూరి కోడీలనపుడు రాజుదింపినాడూ
తయారుపరచి విడిచినాడయ్యా కోడీల నపుడూదా
కేకలు యపుడు విన్నదయ్యా బొబ్బిలి కోడయితే
యెక్కడలేని గోపముగలిగెను బారాకోడికిని
వచ్చినంతలో కన్నులచూచెను కోడీల నపుడుదా
రెక్క యపుడు తట్టినిలిచెను బారాకోడిదా
కోడిలమీదికి దూకెనయ్యా బారాకోడిదా
కూతనువేసి కోడిలనపుడు కొక్కరించి చంపె
ముక్కున కాలున పొడిచిచంపెను బారాకోడిదా

రెక్కలుదాటున యదిమిపట్టెను బారాకోడిదా
కాళ్లతోతన్ని గొంతులుగోసెను బారాకోడిదా
మొత్తుదు దింపుదు కోడీల నపుడు చంపివేసినాది
రాజుగారి కోడీలుయంతా ఖాతమైపోయెను
యింతవరకు దెబ్బలేదయ్యా బొబ్బిలి కోడికి
పేరుజెందిన సరదారికోడి బొబ్బిలి కోడయినా
అచ్చటవున్న కోడీలనంత విడిపించినాగయ్యా
అన్నికోడీలను తరిమిజంపె బొబ్బిలి కోడయితే
యింతలోకి యేమన్నాడు విజయరామరాజు
పరాకుంచర వినండిమీరూ వెంగళరాయూడా
కాసాకోడీలను విడిపించెదము వెంగళరాయూడా
ఈరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుడు
అప్పుడేమని పలికినాడయా వెంగళరాయుడు
దగ్గరయున్న సేవకులతో యేమని జెప్పెను
మంచికోడీలను దింపించండి విజయరామరాజు
బాగా నెమలిఫించ కోడిలరాజా రాయిగతేన్నండి
ఈరీతిగా చెప్పినాదయ్యా వెంగళరాయుడు

వ. అప్పుడు రాజుగారి కోడీలను యెక్కడను నిలువక తరుముతున్న బొబ్బికోడియుండగా రాజుగారు వెంగళరాయునిచూచి యిక మనము వేరొక కాసా కోడీలను విడిచి జగడము జేయింతమనగా వెంగళరాయుడు సరేయని దగ్గరనుండు రాజు సేవకులతో మంచి కోడీలను దింపించమని అడుగుతున్నాడు.

మంచిదన్నాడు అట్టివేళలో సేవకులయి తేను
తెచ్చినకోడీలను కన్నులజూచెను వెంగళరాయుడు
కత్తులుయపుడు కాలునగట్టిరి కోడీలకయినా
కోడినియపుడు సవరించినాడూ వెంగళరాయూడూ
పరాకుంచర వినుము యిపుడు బారాకోడినీవు
పన్నెంమీద మొల్లసదరులో కీర్తితెన్నండి
యెన్నికోడీలను పేరత్తినావు బారాకోడిదా
నీదుమానము దూడవలెను బారాకోడిదా
నీదుబలము చూడవలెను లడాయిలోగాను
జంటకోడి ఆయుధంబున భూమినపడెనూ

నీదు కాని ఆయుధంబున భూమిన పడవలెనూ
పేరు కీర్తులే లేవలెనయ్యా బారాకోడీదా
యిట్లు చెప్పి దువ్వినాడయ్యా బారాకోడీని
మంచినీళ్లు తెప్పించినాడయ్యా విజయరామరాజు
రాజుగారి కోడినియపుడు ముందుగ దింపిరి
రాజుగారి కోడినిచూచెను వెంగళరాయుడు
తనకోడిని సవరించి తాయిగ విడిచెను
రెండు కోడీలను అట్టివేళలో తాయిగ దింపిరి
దింపుడు కోడిని కన్నులచూచెను బారాకోడైతే
తగ్గితగ్గి వస్తున్నాది బారాకోడయితే
తగ్గివచ్చె రాయుడు కోడిని కన్నులచూచెను
యెగిరినాదిరా బొబ్బిలికోడి యోజన పొడుగూన
దుమికినాదిర బొబ్బిలికోడి దుమ్ములు యెగరగను
రాజుకోడికి రాయుడుకోడికి కలపటమైనాది
యెగిరిన కోడిని కన్నులజూచెను రాజుగారికోడి
యెగిరినయొక్క రాయుడుకోడి భూమికి తగ్గెనూ
రాయుడుకోడిని చంపను బలములేమిగ రాజుగారికోడికి
తొలిదెబ్బ తప్పించుకున్నాది రాజుగారికోడి
రెండవతూరి కలపటమాయె బొబ్బిలికోడిపై
రెక్కలుయపుడు తట్టినిలిచెను రాయుడుకోడిదా
పొంచిపొంచి బొబ్బిలికోడి గుంపులో దూరెను
రెక్కలతోను తట్టిందిరా బారాకోడీలను
కొండలెట్టిదా నేలకువంచె బారాకోడీలను
పేగులు కండలు నేలబడ్డది కోడీలకపుడుదా
గిరగిరగిర గిరగిరగిర యనుచు భూమినపడ్డాది
వంగివంగి రాయుడికోడి వస్తావున్నాది

వ. రాజుగారి సేవకులు చూచుచున్న్వి కాలుల కత్తుల కట్టి విధ విధముగా కోడీలను విడుచుచుండగ బొబ్బిలి కోడిని గెలువ సాధ్యంబు లేక ప్రాణంబులు విడుచుతున్నాయి గాని వెంగళరాయుని కోడీలవద్ద యేమియు ప్రయోజనములేక పోతున్నది రాజుగారి కోడీలు. అప్పు డెటులున్నదనగా బొబ్బిలి బారాకోడిదా,

కొక్కరించి నిలిచియపుడు కూతలు పెట్టెనూ
యెత్తుడుదింపుడు గోడీలపుడు చంపుతూ వున్నాది
అప్పాడెట్ల వున్నాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి గోడిని యపుడు కన్నులచూచెను
యెక్కడలేని గోపము జెందె రాజుగారు యపుడు
కుడిమీసము మెలికినాడయ్యా కన్నులెఱ్ఱజేసి
గోపముచేత దేహము మఱచి యేమని చెప్పెను
అన్నలార తమ్ములార మాయన్నలార రండు
దింపుడు గోడీలను తెమ్మనిజెప్పెను యట్టిసమయమందు
తెచ్చినగోడిని కన్నులజూచెను రాజుగారు యపుడు
అప్పాడెట్ల వున్నాడయ్యా పాపారాయుండు
వెంగళరాయుని ముఖముజూచి ఘల్లున నవ్వెను
చదురు దిగ్గున లేచినాడయ్యా పాపారాయుడు
నాదుపేరిట గోడిపందెము నేను పెట్టుతాను
ఘడియసేపుదా నిదానించెను వెంగళరాయుండు
యీవిధంబుగా పలికినాడయ్యా పాపారాయుండూ
యింతలోపల కాసాగోడీలను తాముగ తెచ్చిరి
తెచ్చినయొక్క గోడీలను రాజా కన్నులజూచెను
కాకివంటి గోడినిపట్టె పాపారాయుండూ
బంగారంపు అందెలుయపుడు కాలుకు వేసేను
చెక్కిలుదువ్వి ముద్దులాడినాడు పాపారాయుడు
ముందువెనుక జూడవద్దు బాబాగోడీదా
మున్నెంమీదున యెల్లసభలోన కీర్తి తెమ్మండి
యిచ్చట చచ్చినవారికి చాలా వీరస్వర్గము
చావంటే మీరు భయపడవద్దు బారాకోడీదా
యెన్నిరోజులు బ్రతికిన చావుసిద్ధమే బారాకోడీదా
బొబ్బిలియందు పుట్టినవుకా బారాకోడీదా
బొబ్బిలివారికి యిప్పుడు నీవు కీర్తిని తెమ్ము
యీరీతిగా పలికినాడయ్యా పాపారాయుడు
రాజుగారికోడిని యపుడు ముందుగ విడిచిరీ
రాజుగారి కోడిమీదనే పాపారాయుడూ
తనయొక్కకోడిని విడిపించాడు పాపారాయుడూ

రెక్కలుయప్పుడు తట్టినాదిర రాయుడు కోడిదా
రాజుగారి కోడిని యపుడు కన్నుల చూచింది
యెగిరినాదిరా రాయుడుకోడి యోజన పొడుగూన
యెగిరియెగిరి గిరగిర తిరిగి భూమిన పడినాది
రాజు తనకోడి మరణముల కన్నుల చూచెను
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికపుడు

వ. రాజుగారు తన కోడిలన్ని జగడమున వోడిపోవుట జూచి కోపంబున మీసములుదువ్వి సేవకులను బిలిచి మరియు వున్నకోడిలను తెమ్మనగా వారు రాజాజ్ఞప్రకారము దింపుడు కోడీలను తెచ్చి రాజు ముందిడగా, వెంటనే పాపారాయుడు వెంగళరాయుని ముఖముజూచి నవ్వి నేను యిప్పుడు నాకోడీని రాజుగారి కోడీలకుందు పందెము విడిచదను యని కోడికి వీర ప్రతాపమాంటలుబలికి చుంచుదువ్వి విడువగా రాజుకోడిని యోజనపొడుగు యెగిరి చంపెను. వెంటనే రాజుగారికి కోపంవచ్చి,

## రెండవ పర్యాయము కోడీలజగడము

యెత్తుడు దింపుడు కోడీలను రాజు తెప్పించినాడు
వచ్చెను కోడీలను కన్నులజూచెను బారాకోడీదా
యెగిరియెగిరి యిరువై ముప్పై కోడీలను జంపెను
దూకినదూకున ముప్పైనలభై కోడీలను జంపెను
కోడిలకిందికి చారదీసెను బారాకోడీదా
యొకకాలితోతొక్కె యొకకాలితో గొంతుగోసెను
రెక్కలయినా తాటించినదిరా రాయుడుకోడేమి
రెక్కక్రిందా కొంతకోడీలు చిత్తైపోయినాది
యేతట్టు జూచినగాని గోడీపుంజులేమి
యెగిరితన్ని గోడీలనపుడు హాయిగ జంపేను
మన్నువిడిచి వెళ్ళినాదిరా రాజుగారిగోడి
పిల్వపిల్వ తిరిగిజూడక పారిపోయినాది
గోడిలతరిమి రాయుడుగోడి చేతికివచ్చెను
చెక్కిలిదువ్వి ముద్దులాడినాడు పాపారాయుడు
సేవకుల చేతికిచ్చెను బారాగోడీని
అప్పుడెట్లా వున్నాడయ్యా పాపారాయుడు

వెంగళరాయుడు రంగారాయుడు ముఖముజూచినవ్వె
బొబ్బిలివారు గెల్చినారు రాజు వోడినారు
అప్పుడట్లా వున్నాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి ముఖముజూచి విజయరామరాజు
పాపారాయుని వెంగళరాయుని ముఖముచూచినాడు
ముసిముసినవ్వులు నవ్వుకున్నారు బావమరుదులూ
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికపుడు
మంచిదన్నాడు బాగన్నాడు విజయరామరాజు
అక్కడవుండే డేరాలంతా కట్టివేసినారు
విజయనగరము వచ్చిచేరెను విజయరామరాజు
కొలువుచావడిలో కొలువైనాడు విజయరామరాజు
ఆలోచన చేస్తువున్నాడయ్యా విజయరామరాజు
పక్కపెల్లున లేపించవలెను బొబ్బిలికోటలూ
ఇట్లు రాజుగారికి కోపము అయితే మనస్సున వున్నాది
వీరికథలు యీలాగున్నది విజయనగరమందు

వ. ఈ విధముగా విజయరామరాజు గోడిపందెములో వోడుచుండడం పాపారాయుడున్ను వెంగళరాయుడున్ను నవ్వుచున్నారు. దానిని చూచి రాజుగారు కోపముజెంది తన డేరాలన్ని విప్పి మూటలుగట్టి విజయనగరంబుచేరి బొబ్బిలికోటలో నుండు వెంగళరాయునిన్ని పాపారాయునిన్ని గర్వం బణచవలయుననియు, వాని కోటలు విరుగ కొట్టవలయుననియు దలచి ఆలోచిస్తున్న సమయమున

మన్నెంమీదికి వచ్చినారుగ బొబ్బిలిదొరలేమి
అన్నదమ్ములు బావమరుదులు బొబ్బిలిచేరిరి
వీరికథలు యీలాగుచున్నది బొబ్బిలికోటాలో
అట్లుండగ కొద్దిరోజులు కాలముజరిగిన తర్వాత
పక్కనాటియా కాలమందు యొకడువస్తాడు
పుసుచ్చేరి యేలేటివాడు ప్రాంశీలబూచి
గోల్కొండ నవాబుదగ్గఱ పరమానంనేలు
కళింగరాజ్య కటకందాక పాచ్చారములాయె
సీకాకొళమే సింధుకకడియే పాచ్చారములాయె
గోల్కొండకు ప్రయాణమాయె ప్రాంచిదొరగారు
వొంటెలమీద పైకంమెత్తుకొని వారువస్తారు

తనతండు మార్భలమురాజా వెంటదీసుకొని
మందుగుండు సామానులతోటి ప్రయాణమాయెను
లక్షాడబ్బైనాలుగువేల దళములతో ప్రయాణమాయె
హైదరజంగు అనేటివాని వెంటతీసుకొని
లాల్ఖానుడు అనేటివాణ్ని వెంటతీసుకొని
ముందుగుండు సరదారులతోటి ప్రయాణమాయెను
గోల్కొండకు వచ్చిచేరిరిగా ప్రాంచిదొరగారు
గోల్కొండలో దర్గామిట్టల డేరావేయించి
యెండలాకు యెత్తించినారు యెఱ్ఱపట్టుడేరా
నీడలాకు యెత్తించినారు నీలిపట్టుడేరా
మంచులాకు యెత్తించినారు మైనపు లండీలు
రామసింగు డేరాలోగ కొలువు తీరినాడూ
గోల్కొండ పాచ్చావునకు రాజా వరదీ బంపేను
గోల్కొండ జమాబందికి మేమేవస్తిమీ
మీలెక్కపక్కలు జవాబందికి రాయిగజూడండి
ఈవిధంబున వరదీచాల రాయిగ బంపేను
మంచిదిమరి బాగన్నాడు పాచ్చావు దొరలు
లెక్కపక్కలు జమాబందిని చూస్తువున్నారు
లక్షాపయికము చెల్లించెను ప్రాంచిదొరగారు
అప్పుడేమని పలికినాడుగ ప్రాంచిదొరగారు
ప్రాంచిగారికి పాచ్చావునకు రాయితీ వున్నాది
అంతహాయిగావుండే సమయమందున ప్రాంచిదొరగారు
సంధిచేసుక మనవిజేసిర ప్రాంచిదొరగారు
పరాకులేక వినండిమీరు పాచ్చావు దొరలు
తూర్పుదేశం చూడనునాకు వాంఛావున్నాది
తూర్పుదేశం చూచినేను పుదుచ్చేరి కేమి
పుదుచ్చేరయినా జేరుతానుగ పాచ్చావు దొరలు
ఈ విధంబున మనవిజేసెను బూచిదొరగారు
బూచిమాటలు విన్నారండి పాచ్చావు దొరలు
చాలించు చాలించువోయి బూచిదొరగారు
తూర్పుదేశం కర్ణాటకము చాలావున్నాదీ
కర్ణాటక పాచ్చావులు నిన్ను అటకాయించేరు

కానిపోని మాటలవల్ల కలహాం బుట్టును
పుదుచ్చేరికి పొమ్మన్నాడండి వచ్చాదొరవారు
ఈ విధంబున పలికినాడుగ పాచ్చావు దొరలు
అప్పుడేమని పలికినాడుగ పాచ్చావు దొరలుదా
అంతియాట శెలవివ్వావద్దు పాచ్చావు దొరలు
మీ తాలూకామద్దత్తయిన రాయిగ బంపండి
యీ విధంబుగ పలికినాడు బూచిదొరలుదా
గొప్పగొప్ప వుల్బాయలే సదరు పెట్టినాడు
బూచివారు వుల్బాయలకే సంతోషపడినారు
మంచిది బాగన్నారండి పాచ్చావు దొరలు
అయినా నమ్మవద్దుర నమ్మరాదుర ప్రాంచివారిని
బందరు మరి కాపురస్తుడు దుబాసి లక్ష్మడు
కాగితంబు కలంపుల్లగా చేతబట్టినాడు

వ. ఇట్లుండు సమయంబున పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంశీల బూచి గోల్కొండకువచ్చి పాచ్చావుదొరలనుచూచి తగిన సన్మానం పొంది ప్రాంశీలబూచి పాచ్చావు దొరలనుచూచి నేను తూర్పుదేశం చూచిపోతాను నాకు సెలవివ్వవలె ననగా అందులకా పాచ్చావు దొరలు మీరు తూర్పుదేశం పోవుట బాగలేదు. మీరు పుదుచ్చేరికి పొన్నండియని జెప్పిన అందులకా ప్రాంశీలబూచి నాకు చాలా ప్రయాశ వున్నది. అటుకాకున్న మీ గుమాస్తాలను యెవరయినను పంపుమనగ పాచ్చావుదొర సరేయని బందరుకాపురస్తుడగు దుబాసి లక్ష్మయ్యకు జాబువ్రాస్తున్నాడు. యెటువలెననగా,

దుబాసివారి లక్ష్మయ్యకే జాబులు వ్రాసేను
విన్నదివేగం కన్నదిశీఘ్రం దుబాసిలక్ష్మయ్య
జాబుజూచిన తక్షణమున నా భేటికి రన్నండి
గోల్కొండకే చేరవలెనుగ దుబాసిలక్ష్మడా
యీ విధంబున జాబులువ్రాసి తయారుజేసెను
హర్కారుల చేతికిచ్చెను జాబుకమ్మలేమి
బందరుకయినా పంపినాడుగ పాచ్చావు దొరలు
దుబాసివారి లక్ష్మయ్యావో భేటికివచ్చి
నిండుకొలువున జాబులువుంచి దండంబెట్టిరి
లకోటాలుమరి చించినాడు జాబుచదివినాడు

జాబులోన వర్తమానము కన్నుల చూచేను
గోల్కొండకే బయలుదేరెరా దుభాసిలక్ష్మయ్య
పాచ్చావుల చేటికివచ్చి సలాంచేసేను
ఖైటో అనగ నిందుకొలువున కొలువుతీరినాడు
జాబుకైన మళ్ళినాడు దుభాసిలక్ష్మయ్య
నన్ను పిలిపించిన కారణమేమి పాచ్చావుదొరలు
పరాకులేక వినండిమీరు దుభాసిలక్ష్మయ్య
తూర్పుదేశం చూడనుబూచి వస్తుయున్నాడు
మందుగుండు సామానులతోటి బూచివస్తాడు
అక్కడ కడ్డికార్యములు జరగకుండా తీసుకపొన్నండి
యెదురుచేటికి రమ్మనిచాలా జాబులు వ్రాసేను
తూర్పుదేశం కర్ణాటముగ చాలాయున్నాది
కర్ణాటక పాచ్చావులవద్ద గల్బాలేకుండా
తిరిగిపుదుచ్చేరికి పంపించి నాచేటికిరన్నండి
ఈ విధముగా పల్కినాడుగా పాచ్చావుదొరలు

వ. ఇట్లు జాబువ్రాసి దుభాసిలక్ష్మయ్యకు పంపించిన వెంటనే దుభాసిలక్ష్మయ్య బయలుదేరి పాచ్చావుల దొరలు వద్దవచ్చి సలాం చేసి నిల్వగా పాచ్చావుదొరలు లక్ష్మయ్యనుచూచి వీరు తూర్పుదేశం చూచి పోవలనంటారు గనుక, నీవు తూర్పుదేశం తోడ్కొనిపోయి యేమియు జగడములు లేక పుదుచ్చేరికి మరల పంపి పిమ్మట నా చేటికి రావలయును అనెను.

కల్వాలు అంది బూచివారిపో చేటికి వచ్చారు
సలాంసేకు సలాంసేకు బూచిదొరవారు
తూర్పుదేశం పోదామండి బూచిదొరగారు
ఈ విధంబుగా పలికినాడయ్యా దుభాసిలక్ష్మయ్య
కట్టించిరి డేరాలాడ గాడిబండ్లమీద
యెత్తించిరి డేరాలాడ యెద్దులమీదాను
తన్నుగొలిచిన రాణువలంతా ప్రయాణమైనారు
దండుకుముందు సుబేదారుడు హైదరుజంగోజి
హైదరుజంగు ప్రయాణం ఆ ఘడియలోన
మందుగుండు సామానులతోటి ప్రయాణమైనారు
గోల్కొండ లేచినమజిలీ యెక్కడ దిగుతారూ

అనకాపల్లెలో మజిలీలేచె బూచిదొరగారు
అనకాపల్లెలో లేచినమజిలీ రేఖలవలనలో
రేఖలవలన లేచినమజిలీ సోడారములోను
సోడారములో లేచినమజిలీ యెక్కడదిగుతారు
సోడారములో లేచినమజిలీ పిటాపురములోను
పిటాపురములో లేచినమజిలీ యెక్కడదిగుతారు
పిటాపురములో లేచినమజిలీ పెద్దాపురములోను
పెద్దాపురములో లేచినమజిలీ యెక్కడదిగుతారు
పెద్దాపురములో లేచినమజిలీ రాయలచెరువులో
రాయలచెరువులో లేచినమజిలీ యెక్కడదిగుతారు
రాయలచెరువులో లేచినమజిలీ నల్లచెరువుకాడా
డేరాలోపల కొలువైనాడు ప్రాంచిదొరలూదా
దుభాసివారి లక్ష్మయ్యానే బేటికి పిలిపించి
పరాకులేక వినండిమీరు దుభాసి లక్ష్మయ్యా
విజయనగరము యేలేటివాడు విజయరామరాజు
రాజువారి పేరిటవక్కా కాగితంపంపండి
ఇన్నిమాటలే పలికినాడుగ ప్రాంచిదొరలూదా
కాగితం కలంపుల్లగ చేతబట్టినాడు
పరాకులేక వినండిమీరు విజయరామరాజు
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంచిదొరగారు
ఇరువది నాలుగు దళముతో ప్రాంచివచ్చినాడు
తూర్పుదేశము చూదిరాజా ప్రాంచిపోతాడు
మీరు యెదురుసేవకే రావలెనయ్యా విజయరామరాజా
యిన్నిమాటలే వ్రాసినాడుగ జాబుకులోగాను
జాబువ్రాసి హార్కారుల చేతికిచ్చినాడు
విజయనగరమే పంపినాడు జాబును గనుకానూ
తిరిగి కాగితంబులే కలంపుల్లగ జేతపట్టినాడు
బొబ్బిలియేలే రంగయ్యాకు జాబులు వ్రాశాడు
పరాకులేక వినండిమీరు రంగయ్యాదొరగారూ
పుదుచ్చేరి కాపురస్తుడు ప్రాంచిదొరగారూ
తూర్పుదేశం చూడనురాజా వస్తావున్నాడూ
యెదురుభేటికి రావలెనయ్యా రంగయ్యాదొరలు మీరు

యిన్ని వయిసములు వ్రాసినాడుగ జాబుకులోగాను
హర్కారుల చేతికిచ్చిదా జాబుపంపినాడూ
బొబ్బిలికోటకు పంపినాడుగ జాబుకమ్మలేమి
బొబ్బిలివారి దేవిడికాడ పారాలున్నారు
పారాకాడికి డాకలయిరి హర్కారులేమి
యెవ్వరి తాలూకన్నారండి పారాచౌకీలు
దుబాసివారి లత్తుమయ్యనే తాకి పంపాను
పాచ్చావుల నవానరిగి దుబాసిలత్మయ్య
జాబుకమ్మలు వ్రాసిపంపెను దుబాసిలత్మయ్య
యీా విధంబున బల్కినారు హర్కారులేమి
అప్పుడేమని బలికినారు హర్కారులేమి
రంగారాయుడు భేటికిపోయి వరదీ తెస్తాము
అంతవరకు నిదానించుము హర్కారులేమి
ఆడనుంచి వచ్చినారుగ పారాచౌకీలు
రంగారాయుడు భేటికివచ్చి దండంబెడుతారు
పాచ్చావులవారి దివానగిరియంట దుభాసిలత్తుమయ్య
జాబుకమ్మ లంపించినాడుగ దుభాసిలత్తుమయ్య
దేవిడికాడ వున్నారండి హర్కారులేమి
రమ్మంటార పొమ్మంటార రంగయ్యదొరవారు
రమ్మనిచాలా సెలవిచ్చెను రంగయ్యవారు
అటకాయింపు లేకుండనే రమ్మని జెప్పెనూ
కల్వాలు అంది వచ్చినారుగ పారాచౌకీలు
ఆడనుంచి వచ్చినారుగ హర్కారులేమి
రంగారాయుడి కొల్వుకురాజా కదలివచ్చినారు
కొలువునవుంచి రాజులుగనుక దండం పెట్టిరి
లకోటాల మరిచించి జాబుచదివినాడు
పంక్తి పంక్తి పారజూచెను రంగయ్యదొరగారూ
జాబులోని వర్తమానము కన్నుల చూచెనూ
తిరుగు జాబులయిన వ్రాయలేదు రంగయ్యదొరలూడ
వారికథలు ఆలాగున్నది బొబ్బిలి లోగనూ
అక్కడ విజయనగరమే వ్రాసినజాబు వారికిజేరింది
జాబులోని వర్తమానము కన్నుల చూచెనూ

బూచి అనగ నల్లగుండు టాయిగ పగిలెను
హర్కారుల పంపినాడుర విజయరామరాజు
వెనకాముందు తోచలేదుగ రాజువారికేమీ
ఆలోచన చేసినాడు విజయరామరాజు
రెండుదినములు ఆలోచించెను విజయరామరాజు
బొబ్బిలిమీదుగ మనసువచ్చెను రాజువారికేమి
వెంగళరాయుడి పేరిట జాబులు వ్రాసెనురాజు

వ. వెంటనే దుభాసిలక్ష్మయ్య ఫ్రాంచిదొరవారివద్ద వచ్చినిలిచి బయలుదేరమనిజెప్పి తోడ్కొని అనేక నదులు, కొండలు, సోడారము, పిఠాపురము, పెద్దాపురము యివన్ని గడచి విజయనగరము యెల్లకువచ్చి డేరావేసి దుభాసిలక్ష్మయ్య విజయరామరాజుగారికి యొకజాబున్ను బొబ్బిలి కొక జాబువ్రాయగా, సేవకులు దానందుకొని బొబ్బిలి కివ్వగా, బొబ్బిలివారు చదివిచూచి మరల జవాబు వ్రాయకున్నారు. విజయనగరమునకు పంపినజాబు విజయరామరాజు చదివిజూచి చనచేసి బొబ్బిలివారికి యొకజాబు వ్రాస్తున్నాడు. యెటువలెననగా,

చిన్నమాట చిత్తగింపుము వెంగళరాయుడా
మామీద కటాక్షముంచుము వెంగళరాయుడా
మాకుమీకు యెన్నిపగలున్నా వెంగళరాయుడా
పరావారికి మన్మ్య అయిన పట్టియివ్వవలదు
యిపుడు పుదుచ్చేరి యేలువాడు ఫ్రాంశీలబూచి
మందుగుండు సామానులతోటి ఫ్రాంచి వచ్చినాడు
యెదురుసేవకు రమ్మనినాకు జాబువ్రాసినాడు
వాడియొక్క భాషాయంత్రము మనకు తెలియదు
మనవొక్క భాషాయంత్రము వారికి తెలియదు
వాడుకిల్లును గంజాయితాగిదాకైపునవుంటాడు
ద్రేహం తెలియక వుంటారండీ ఫ్రాంచీలబూచి
మీరుమేము షామీలయితే వెంగళరాయుండా
మనము యెదురుబేటికి పోదామండీ వెంగళరాయుడా
మీరుమేము వొకటిగపోతే వెంగళరాయుడా
అక్కడకానిపోని మాటలవల్ల కలహం వస్తేను
పుదుచ్చేరికి తరుమకొట్టుతాము బూచినిగనుకాను

తిరుగుజాబు వ్రాయవలెనుగ వెంగళరాయుడా
మామీద కటాక్షముంచుము వెంగళరాయుడా
వెనుకటిపగలు తలచవద్దు వెంగళరాయుడా
యిన్నివైనములు తలచి జాబువ్రాసినాడు
జాబువ్రాసి లకోటచేసి బేగిరావుల పిలిపించి
జాబులు బేగిరావుల చేతికిచ్చినారూ
బొబ్బిలికైనా పంపినాడుగ విజయరామరాజు
బొబ్బిలివారి దేవిడికాడ పారాలున్నారు
యెవ్వరితాలూకా యన్నారోయి పారాచౌకీలు
రాజుగారి తాలూకంటా వారుచెప్పినారు
రాజుగారి తాలూకయితే యెందుకు వచ్చితిరి
రాజుగారి పేరిటజాబులు మేము తెచ్చినాము
వెంగళరాయుడు బేటికిబోయి వరదీ తెస్తాము
గడియసేపు నిదానించుమీ హర్కారులేమి
వెంగళరాయుడి బేటికివచ్చి పారావాండ్లయితే
రాజుగారిపేరిట జాబులుమీకు తెచ్చినారు
రమ్మంటార పొమ్మంటార మహాప్రభో నేడు
ఆటకాయింపు లేకుండనే రమ్మనిపలికేను
ఆడనుంచి వచ్చినారు పారాచౌకీలు
పారావాండ్లు బాటనిచ్చిరి హర్కారులకు
వెంగళరాయుడు బేటికివచ్చి జాబులుయిచ్చిరి
దండందండం దండనీకు మహాప్రభో నేను
లకోటాలు చించియైనా జాబుచదివినాడు
జాబులోని వర్తమానము కన్నులచూచేను
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంశీలబూచి
రాజమహేంద్రము జిల్లాలోనే డేరావేసినాడు
కీకర భాకర భాషాయంత్రము ప్రాంచివారిది
కల్లును గంజాయిత్రాగి కైపున వుంటాడు
వాళ్లు తెలియక వుంటారండి ప్రాంచిదండులు
వారివక్క భాషాయంత్రము మనకు తెలియదు
మనవక్క భాషాయంత్రము వారికి తెలియదు
కానిపోని మాటలవల్ల కలహాంవసేను

వుదుచ్చేరికి తరుమగొట్టుతాము ప్రాంచినిగనుకాను
యిన్నివైనములు వ్రాసియున్నది జాబుకులోగాను
ఆమాటల కేమన్నాడు వెంగళరాయుడు
గలగలగలగల నవ్వినాడు వెంగళరాయుడు
రాజువారి పౌరుషము యింతేనన్నాడు
తానుబిలిచితె తానుపోవలె బూచీబేటికి
మమ్మా పిలిచితె మేముపోవలె బూచీబేటికి
తాను కొప్పుపెట్టుకొని కోకకట్టుకొని గోటలో వున్నాడా
మూతిమీసం లేకవున్నాడ గోడకు లోగానూ
మెక్కడలేని కోపమువచ్చె వెంగళరాయుడికి
చదువుకున్న జాబులక్కడ తగలబెట్టినాడు
జాబులు తెచ్చిన హర్కారుల చెంపలు గొట్టించి
మెడలుబట్టి నెట్టించినాడు వెంగళరాయుడు
ఘోదుఘోదున దుఃఖపోయిరి హర్కారులేమి

వ. ఈ విధంబుగ జాబువ్రాసి హర్కారుల చేతికిచ్చి బొబ్బిలియందుండు వెంగళరాయునికి యిచ్చిపంపెను హర్కారులు జాబులెత్తుకొని బొబ్బిలికివచ్చి వెంగళరాయుని ముందు బెట్టగ వెంగళరాయుడు చదివిజూచి నవ్వగా మీరాజు బేడిగా నున్నాడు మీకువస్తే మీరు పోవలె మాకువస్తె మేము పోవలెనని జాబులు తెచ్చిన హర్కారులను చెంపలయందు గొట్టి తరుమగొట్టెను.

అక్కడినుంచి వచ్చినారుగ హర్కారులేమి
విజయనగరము వచ్చినారుగ హర్కారులేమి
ఘోదుఘోదున దుఃఖపోయిరి హర్కారులేమి
వెంగళరాయుడి భేటికిచాలా మేమే పోతిమి
మీరువ్రాసిన జాబుగనుక వారు చదివినారు
చదువుకున్నవో జాబులక్కడ తగలపెట్టినాడూ
పారవేసిన జాబులక్కడ తగలపెట్టినాడూ
మమ్ములను పెళ్ళుపెళ్లున చంపలు కొట్టిరీ
నానానా మాటలుమిమ్ము దూషించినాడు
యిన్నిమాటలు పలికినారుగ హర్కారులేమి
మెక్కడలేని గోపమువచ్చె రాజువారికేమి
కుడిమీసమే దువ్వినాడుగ గుడ్లుమెల్లజేసి

యింతకాడికి వచ్చినాడా వెంగళరాయుడు
వక్క_గడియలో తెపిస్తాను బొబ్బిలిగోటలూ
స్త్రీలచెర బట్టిస్తాను గోటకు లోగానూ
రాజస్త్రీల ప్రాంచికూడు తినిపించక పోతానా
పొట్టక్రొవ్వు పట్టివున్నదండి వెంగళరాయుడు
యిన్నివయినములు పలికినాడు విజయరామరాజు
నన్నుకొలిచె రాజుపులకంతా జాబులు వ్రాసేనూ
తన లతూతొంబై వేలదండుకు జాబులు వ్రాసేను
ఆలోచన జేసినాడుగ విజయరామరాజు
వెండిబండి బంగారం రాజా తెప్పించినాడు
బూచివారికి వుల్బాయలే జేయిస్తున్నాడు
బంగారపు పచ్చలటోపీ చెయించినాడు
బంగారపు పచ్చలకుర్చీ తయారు జేయించి
బంగారపు తట్టనుగనుక తయారు జేయించి
బంగారపు కోడిగ్రుడ్లను తయారు జేయించి
బంగారపు నిమ్మపండ్లుగ తయారుజేయించి
బంగారపు అరటిపండ్లుగ తయారు జేయించి
బంగారపు కోడిపుంజుల తయారు జేయించి
బంగారపు మామిడిపండ్లుగ తయారు జేయించి
బంగారపు ఝూామపండ్లుగ తయారు జేయించి
బంగారపు తీనిపీకలుగ చేయించినాడూ
వుండితట్ట వకటిగనుక జేయించినాడూ
తట్టలోపల పండ్లుఫలాదులు తాను వుంచినాడూ
వుల్బాయులు అన్ని యెత్తుకొనిగ వస్తూవున్నాడు
లతూతొంబై వేలదళముగ కదలివచ్చినాది
యేనుగమీాద యంబారయిన కట్టించినాడు
అంబారిమీాద ముత్యాలపందలి వేయించినారూ
అంబారిలోనే కొలువైనాడు విజయరామరాజు
ఏనుగమీాద రణభేరిగ యెత్తించినాడూ
గుఱ్ఱంమీాద ఢంకాకుండలు యెత్తించినాడు
వొంటెలమీాద నగారకుండలు యెత్తించినాడు
రాజు లతూతొంబై వేలదళములతో బయలుదేరినాడు

ప్రాంచివారి డేరాలకు వస్తావున్నాడు
రంగరంగ వయిభవముతోనే వస్తావున్నాడు
రణమో రణమోయంటు రణభేరిపలికింది
ఢాండాంయని నగార డంకాపలికింది
చాదుమేళమే భరీతుమేళమే కూచీలయినాది
యీవిధంబున డేరాలకు వస్తువున్నాడు
రాజువచ్చి వురవడి ప్రాంచి జూచినాడు
టోపితీసి చేతపట్టుకోని ప్రాంచిదొరగారు
వంగిమూడు కూర్నీసులు చేసే ప్రాంచిదొరగారు
యెదురు సేవకే యేదుయడుగులె ముందు నడచినాడు
అంబారిమరి దిగినాడుగ విజయరామరాజు
రాజుగారు ప్రాంచిగారుగ సంతోషపడినారు

వ. ఇది యిట్లుండ జాబులిచ్చిన హర్కారులు రాజుదగ్గఱవచ్చి జరిగిన సమాచారమంతయు జెప్పి నమ్ములను చెంపల గొట్టినాడనగా యింతపని జేసినాడా వెంగళరాయుడు సరేనని మనసున వుంచుకోని పలువిధముల బంగారుయందు సామానులు జేయించుకోని యేనుగుల మీద అంబారివేయించుకోని ప్రాంచివారి డేరాలకు వచ్చినాడు.

చెయ్యి చెయ్యిపట్టుకోని డేరాకు వస్తారు
ప్రాంచివారికి రాజువారికి కౌగలింపులాయె
అప్పుడు ప్రాంచివారికి పచ్చలకుర్చీ వేయించినాడు
కుర్చీమీదనే కొలువయినాడు ప్రాంచిదొరగారూ
ప్రాంచివారికి యెదురుగానే కుర్చీవేయించీ
తెచ్చినవొక్క వుల్బాయలె కొలువున వుంచెను
సన్నబియ్యము చాయపప్పుగ కొలువున వుంచెను
మేకపోతులే కోళ్ళకావిళ్లు కొలువున యుంచేను
భూతుపిల్లి బుర్కాయిపెట్టి బూచికిమేమాను
బంగారపు కోడిపుంజుల కొలువున యుంచేను
బంగారపు కోడిగ్రుడ్లను కొలువున యుంచేను
బంగారపు ఆవుతరుపుల కొలువున యుంచేను
బంగారపు యేనుగు గున్నల కొలువున యుంచేను
బంగారపు నిమ్మపండ్లు కొలువున యుంచేను
బంగారపు పనసపండ్లు కొలువూన యుంచేను

తెచ్చినవొక్క వుల్బాయలన్ని కొలువున యుంచేను
వుల్బాయలు చూచినాడుగా ప్రాంచిదొరగారూ
వుల్బాయలన్ని జూచియైన కలవరపోయినాడు
నీవంటి సరదారిబిడ్డకు తగును అన్నాడు
పేరయిన సరదాబిడ్డవూ విజయరామరాజా
పరాకులేక వినండిమీరు విజయరామరాజా
పేరయిన వుల్బాయలరాజా నాకేయిస్తివి
తిరిగియేమి వుల్బాలయిన మీకేయిచ్చేది
తూర్పుదేశం చూడనురాజా నేనేవచ్చితిని
యింతేగాని యితరములేదు విజయరామరాజా
యీవిధంబుగా జెప్పినాడుగా ప్రాంచిదొరగారూ
అప్పుడేమని పలికినాడయ్యా విజయరామరాజు
పరాకులేక వినండిమీరు ప్రాంచిదొరగారూ
ఏమివక్క వుల్బాయలు నాకేమివద్దండి
ఏమియిచ్చినా నిల్వపోదుగా ప్రాంచిదొరగారూ
మామీద కటాక్షముంచుము ప్రాంచిదొరగారూ
యల్లసదరునా యున్నారండీ బొబ్బిలి కోటాలు
సాధ్యానికీ రాకయున్నది బొబ్బిలి కోటాలు
మధోన్మత్తులై యున్నారండీ బొబ్బిలి దొరలేమి
దివాణమంటే మతింపులేదు బొబ్బిలి దొరలాకు
పొట్టకొవ్వు మరిపట్టివున్నది బొబ్బిలి దొరలాకు
బొబ్బిలికోట వుల్బాయలే నాకేయివ్వండి
బొబ్బిలికోట పత్మానాలే నాకేయివ్వండి
యీవిధంబున చెప్పినాడయ్యా విజయరామరాజు
రాజుమాటలు విన్నాడండి ప్రాంశీలబూచి
పలుకలేదు మాటాడగలేదు ప్రాంచిదొరగారు
బూచిగారివో మొగముచూచెర విజయరామరాజు
రెండువేల వరహాలయిన సదరు వోసినాడు
వరహాలయిన కన్నులచూచే ప్రాంచిదొరగారు

వ. ఇట్లు తెచ్చిన సామానులన్ని ప్రాంచిముందు పెట్టి నిలువగా ప్రాంచిదొరవారు రాజుకుసలాం చేసి బలే గొప్పవాడని సంతోషపడి వుండగ రాజువారు వెంటనే బహుసంతోషమున బొబ్బిలికోట పెరక

వతెనని బూచిదొరగారితో జెప్పగ బూచిదొరగారు విని వినని వా
మాదిరివుండగ వరహాలు ప్రాంచిముందు పోశాడు విజయరారాజు
బొబ్బిలికోట పర్మానాలు వ్రాసియిచ్చేను
ఆడనుండి రాణువలంతా బయలుదేరినారు
రాజుగారు బూచిగారు పామీలయినారు
అప్పుడేమని పలికినాడుగ విజయరామరాజు
తన్ను గొలిచె రాణువలంతా తాను బిలిచినాడు
తనలక్షాతొంబై వేలదళముతో బూచివచ్చేను
యిరువయినాలుగు వేలదళముతో బూచివచ్చేను
బూచియిరువైలుగు వేలదళముతో ప్రయాణమైనాడు
తనమంది మార్బలమును వెంటతీసుకొని
బూచిగారు రాజువారు బొబ్బిలికొస్తారు
అప్పుడు కిటకిటమంటూ దండేవస్తాది
యీవిధంబున వస్తువున్నారు బొబ్బిలికోటకు
వారికథలు ఆలాగున్నది అనగా పల్లెలోను
బొబ్బిలియేలే రంగయ్య యేలాగున్నాడు
జాబువచ్చిన మొదలుకొనిగ రంగయ్యదొరగారు
రాజుగారిని నమ్మలేక నే రంగయ్యదొరగారు
వక్కనాట సమయమందున రంగయ్యదొరగారు
నిండుకొలువున కొలువైనాడు ప్రభువురంగరాజు
తన్నుకొల్చే రాణువలంతా కొలువైయున్నారు
తాంద్రవారి పాపారాయుడు కొలువునలేడండి
అప్పుడేమని పలికినాడుగా ప్రభువు రంగరావు
ఇద్దరియొక్క హర్కారుల కొలువుకు పిలిపించి
తాంద్రవారి పాపారాయుడు కొలువుకు రాలేదు
తాంద్రవారి పాపారాయుని కొలువుకు పిలవండి
ఈ విధంబున పలికినాడుగ ప్రభువు రంగారావు
పరుగుపరుగున వచ్చినారుగ హర్కారులయితేను
పాపారాయుడు బేటికివచ్చి దండంబెట్టిరి
పరాకుచేయక వినండిమీరు పాపారాయూడా
మీబావగారు రంగయ్య పిలువమన్నారు
ఈ విధంబున పల్కినారుగ హర్కారులయితేను

చదురుదిగ్గున లేచినాడయ్యా పాపారాయుండు
కూర్మిజుచ్చుల పల్లకిలోను కొలువుతీరినాడు
పన్నెండుమంది గాలుబోయులు పాలకిబట్టిరి
నిండుకొలువుకే వచ్చినాడుగ పాపారాయుండు
రంగారాయుడి జేటికివచ్చి పాలకితగ్గను
పాలకితగ్గి కొలువుకువచ్చే పాపారాయుడు
వందనమయ్యా వందనమయ్యా మహాప్రభోనేడు
నన్ను బిలిచిన కారణమేమి తెలియ జెప్పండి
ఈ విధంబున పలికినాడుగ పాపారాయుండు
పరాకులేక వినండిమీారు పాపారాయూడా
పుదుచ్చేరి కాపుంస్తుడు ప్రాంచిదొరగారు
తూర్పుదేశం చూడనురాజా వస్తువున్నాడు
రాజరంపై కోటలోనికి రాణాపొన్నండి
మిమ్ముగొలిచే రాణువలంతా వెంటపిలుచుకొని
సలహాసమ్మతి మాటలమీాద వెనక్కు బంపండి
కానిపోని మాటలవల్ల కలహాము వస్తేను
నల్లయేటిలో సాల్పులయినా గోరిపెట్టించి
త్వరగా రాజారంపు కోటలోనికి టాణాపొన్నండి
ఈ విధంబుగా పలికినాడు రంగయ్యాదొరగారు
ఆడనుంచి బయలుదేరెను పాపారాయుడు
తన్నుకొలిచే రాణువలంతా వెంటతీసుకొని
రాజారంపు కోటలోకి పోతూవున్నాడు
పాపయ్యాకే శల్యాలుయిచ్చే ప్రభువు రంగరావు
పన్నెండుమంది తెల్గలానే తాను బిలచినాడు
మమ్ముపిలిచిన కారణమేమి రంగయ్యాదొరగారు
పుదుచ్చేరి కాపురస్తుడు ప్రాంశీలబూచి
తూర్పుదేశం చూడనురాజా వస్తువున్నాడు
ఈ విధంబున పలికినాడు రంగయ్యాదొరగారు
మంచిదిమరి బాగన్నారోయి తెల్గాలయితేను
వారివారి ఆయుధములుగా చేతబట్టినారు
బంటుకు పన్నెండు ఆయుధాలతో ప్రయాణామైనారు
పీర్లతట్టుకు వచ్చినారుగా తెల్గాయితేను

తన్నుగాలిచే రాణువలంతా వెంటతీసుకోని
రాజారంపు చేరినాడుగ పాపారాయుడు
రాజరములో తాయిగాను పారావున్నారు
వీరికథలు యీలాగున్నది బొబ్బిలి మీదాను

వ. ఇది యిట్లుండ బొబ్బిలివారు విజయరామరాజును నమ్మలేక వెంగళరాయుడు పాపారాయుడు రంగారాయుడు వారంతయు ఆలోచించి రాజాపురంపుబాటలో తెల్గాబిడ్డలుతో సహా పారాయున్నారు

ఆడ రాజమహేంద్రము జిల్లానుండి రాజగారుతాను
ప్రయాణమై వస్తున్నారు బొబ్బిలికోటకు
రాజుగారు బూచిగారు షామీలయినారు
రాజమహేంద్రము లేచినమజిలీ యెక్కడ దిగుతారు
నల్లకొండలో మజిలీచేసిరి ప్రాంచిదొరగారు
నల్లకొండలో లేచినమజిలీ పెద్దాపురములోను
పెద్దాపురములో లేచినమజిలీ యెక్కడదిగుతాను
పెద్దాపురములో లేచినమజిలీ పిఠాపురములోను
పిఠాపురములో లేచినమజిలీ యెక్కడ దిగుతారు
పిటాపురములో లేచినమజిలీ సామర్లకోటలోను
సామర్లకోటలో లేచినమజిలీ మన్నెంమీదను
మన్నెంమీద డేరాలయిన వేయించినారు
మన్నెంమీద దిగుమతులాయ ప్రాంచిదొరగారు
నిండుకొలువున కొలువైనాడు ప్రాంచిదొరగారు
అప్పుడెల్ల వున్నాడయ్యా విజయరామరాజు
బూచిగారి బేటీకిరాజూ వస్తువున్నాడు
ప్రాంచివారి బేటికివచ్చి సలాంచేసేను
అప్పుడేమని పలికినాడు విజయరామరాజు
పరాకులేక వినండిమీరు ప్రాంచిదొరగారు
మన్నెంమీదపోతే బొబ్బిలి మూడామడవుంది
మన్నెంతిరిగిపోతే బొబ్బిలి ఆరామడవుంది
అట్లపోదామా యిట్లపోదామా ప్రాంచిదొరగారు
పరాకులేక వినండిమీరు ప్రాంచిదొరగారు
మన్నెంతిరిగి పోతామండి ప్రాంచిదొరగారు
ఈ విధంబున పలికినాడయ్యా విజయరామరాజు

అప్పుడేమని పలికినాడు ప్రాంచిదొరగారు
మన్నెంతిరిగి పోకూడదు ప్రాంచిదొరగారు
తాండ్రవారి పాపారాయుడు తానావున్నాడు
రాజారంపు బాటలోన తానావున్నారు
రాజధానికి చేరనివ్వడు పాపారాయుడు
నల్లయేరు మరి దాటనివ్వడు పాపారాయుడు
అడవిబాటగా పోదామండి ప్రాంచిదొరగారు
యీా విధంబున పలికినాడు విజయరామరాజు
అయితేమంచిది మరిబాగన్నాడు ప్రాంశీలబూచి

వ. వీరిట్లుండగా విజయరామరాజు ప్రాంశీలబూచి తండు దళంబుతో బయలుదేరి వస్తూయుండగ రాజుగారు దొరవారినిజూచి ఈ దోవమీాదుగ పోవలెకాని రోడ్డుగాపోతే చాలాదూరముంది పాపారాయుడు తానాబాటలో కొలువున్నాడు వాడు చాలా దుర్మార్గుడు. మనలను ఆ దోవలోనే చంపుతాడని జెప్పెను. సరేనన్నాడు ప్రాంశీలబూచి,

అప్పుడెట్లా వున్నాడయ్యా విజయరామరాజు
తన్నుకొలిచే రాణువలంతా తాను బిలిచినాడు
అన్నలార తమ్ములార మా యన్నలార
తండుకుమన సుభేదారుగ జగన్నాధరావు
శాకర్లపూడి జగన్నాథరావును కొలువుకు పిలవండి
నిందుకొలువుకై పిలువమన్నారు హర్కారులేమీా
మంచిదిమరి బాగన్నారు హర్కారులేమీా
వందనమయ్యా వందనమయ్యా జగన్నాధరావు
రాజుగారు పిలువమన్నారు జగన్నాధరావు
యిన్నిమాటలు విన్నాడయ్యా జగన్నాధరావు
తన్నుగొలిచే రాణువలంతయు వెంటదీసుకొని
రాజుగారి కొలువుకువచ్చే జగన్నాధరావు
నన్ను పిలిచిన కార్యమేమి యెరుగ బల్కుము
కొందరయిన హర్కారులను వెంటతీసుకొని
అడవిబాట గొట్టించుము జగన్నాధరావు
మన్నెంమీాదికి అడవిబాటలు గొట్టించుమయ్యా
మంచిదన్నాడు బాగన్నాడు జగన్నాధరావు

మూడువేల రాణువులను వెంటతీసుకొని
ముందుగ తాను మన్నెంమీదికి బాటలు గొట్టెను
చెట్టుపుట్టలు గొట్టెనయ్య టాయిట యపుడుదా
గొప్పగొప్ప వృక్షములంతయు గొట్టి తోంచెనయ్య
నాలుబట్టిదా బాటలుయపుడు యేర్పఱచినారూ
రాజవీధిగా గొట్టుతాడయ్యా జగన్నాథరావు
యారీతిగా బాటలుయపుడు యేర్పఱచినాడు
అపుడేలాగు నున్నాడయ్య విజయరామరాజు
కట్టివేసెను డేరాలపుడు గాడిబండ్లమీద
యెత్తించెను డేరాలపుడు యెద్దుల బండ్లమీద
ఫిరంగిగుండ్లు యెత్తించినారు గాడిబండ్లమీద
తాచూరి పొగబాణము బండ్లమీద వేసిరీ
మున్నారు జీనిగుఱ్ఱములు ముందుగ నడిచేను
ఆ వెంబడి కదలెనయ్య యేనుగూలబారూ
ఆ వెంబడి వస్తున్నాడు లాల్ఖాను డయినా
ఆ వెంబడి వస్తున్నాడు హాయిదరు జంగోజీ
ఆ వెంబడి వస్తున్నాది ఫ్రాంశీలదండు
ఆ వెంబడి వస్తున్నాడు దుభాసి లక్ష్మను
ఆ వెంబడి వస్తున్నారు రాజుల దండయితే
మన్నెంవిడిచి నడిచినారు రాణువలంతాను
అర్ధరాత్రి డీకొన్నారు వీరల తట్టుకూ
వీర్లతట్టులో వన్నెండుమంది తెల్గాబిడ్డాలు
మరచి నిద్రపోతున్నారు తెలగాబిడ్డాలు
గుఱ్ఱపుసందడి విన్నారయ్యా తెలగాబిడ్డాలు
పడకయుండె దట్టిగట్టిరి తెలగాబిడ్డాలు
యీటికత్తులు చేతబట్టిరి తెలగాబిడ్డాలు
చెట్టుయెక్కి చూచినారయ్య తెలగాబిడ్డలు
దొంగగుఱ్ఱములు వచ్చియపు తెట్టుకమ్మినాది
అన్నలార తమ్ములార మాయన్నలార
రంగయ్యతో చెప్పను ఆలస్యమాతుంది
రామరామయని అనంతకాలము రాజ్యమేలలేము
జగమువుండు కాలమువరకు మనము వుండబోరామా

శ్రీరాములు యేలినట్లుగ రాజ్యమేలలేము
యెన్నిదినములు బ్రతికినగాని చావుసిద్ధముగా
యిచ్చట చచ్చిన వారికి యిపుడు వీరస్వర్గము

వ. ఈ విధంబుగా మాట్లాడుకొని కాకర్లపూడి జగన్నాథ రావును రప్పించి అడవుల యందయు బాటలుగా గొట్టి వస్తున్నారు అధికాంచిన తెల్లాబిడ్డలు పన్నెండుమందిని యీ సమాచారం రం గయ్యా దొరగారితో జెప్పను చాలా ఆలస్యమాతుందని యెంచి వారు బయలుదేరి జగడంబుజేయ నారంభించెను

ధయిర్యము చేసుకోని తెట్టులోదూకిరీ
కలిచికలిచి తీసినారయ్యా కవాతు గుఱ్ఱము
వెనుకచిక్కి వస్తున్నారు ప్రాంశీలదండు
యచ్చటనుండు రాణువమీద కలపటమైనారు
నరికినరికి తోచినారయ్యా యేనుగుల గుంపుదా
మాష్టికుల గొట్టితోసిరి ముందుగ యపుడుదా
కండలుపేగులు బయటికివచ్చి భూమిన పడినారు
యక్కడయుండు పారాలన్ని వెనుక వెళ్ళినాది
తెట్టులో దూకినారుగ తెల్గాలయితేను
వెనుకపోయిన దండుయపుడు ముందుకువచ్చింది
మున్నూట కవాతుగుఱ్ఱము ముందుగ నడిచిందీ
తెల్లవారున డీకొన్నది తురుపు గుఱ్ఱాలు
గుఱ్ఱపుచప్పడి విన్నారయ్యా తెలగాబిడ్డలూ
పన్నెండుమంది తెలగాబిడ్డలు టాయిగవచ్చిరీ
వొకరి నొకరిని యెచ్చించిదా తెలగ బిడ్డలూ
మించివచ్చినకార్యమిపుడు విడువకూడదన్నా
చచ్చిన బ్రతికిన పేరుంటుంది వీర్ల తెట్టులోను
వెనకాముందు జూడవలెను దండుకు లోగాను
దండుకులోగ దూకినారు తెలగాబిడ్డలూ
గుద్దిగుద్ది చంపినారయ్యా గుఱ్ఱముల గుంపును
చేతిలోను నలిపినారయ్యా గుఱ్ఱముల గుంపును
మెడనుబట్టి వీపుమీద బాకులతో పొడిచిరి
చెట్లకిందనే చేంనిచ్చాక తరుముతు వున్నారు

అప్పుడెటుల వున్నాడయ్యా హాయిదరుజంగోజి
వీర్లతట్టు యుద్ధమప్పుడు కన్నులా జూచేను
గుండెలుయప్పుడు గుద్దుకొన్నడు హాయిదరుజంగోజి
ప్రాంచివారి బేడికివచ్చె హాయిదరుజంగోజి
వీర్లతట్టు యుద్ధమిప్పుడు జరుగుతు యున్నాది
పన్నెండుమంది తెలగాబిడ్డలు టాయిగ వుంటారు
యికనేమున్నది యికనేమున్నది ప్రాంచిదొరగారు
యనేకదండు హాతమైపోయెను ప్రాంచిదొరగారు
గెట్టివారట గెట్టివారట తెలగాబిడ్డలు
జయించజాలము జయించజాలము వీర్లనయితేను
మూడుపుట్ల నల్లమందుకే శల్వాలు యివ్వండి
నల్లమందితోడి బూడిపించెను హాయిదరుజంగోజి
నాలుగుప్రక్కల వత్తులుత్రాళ్లు సొంపుగ పెట్టిరి
వత్తులప్పట్టి జాతులవారు వెంబడియున్నారు
మున్నూరు కవాతుగుఱ్ఱము ముందుగ నడిచెను
గుఱ్ఱమని దూకినారూ తెలగా బిడ్డాలూ
నాలుగుప్రక్కల త్రిప్పినారుకి కవాతు గుఱ్ఱాలను
తెలియకవచ్చి నల్లమందులో గొబ్బున పడినారు
నాలుగు ప్రక్కల మందుత్రాళ్ళ అంటించినారు
ధగ్గుధగ్గున రగిలినాదయ్యా ధూళికలోగాను
మలమలమని మాడినారయ్యా తెలగాబిడ్డాలు
నల్లమందుకే ధూళియైనారు తెలగాబిడ్డాలు
రాత్రివేళ యొకవేళలో తెల్లుముంటరీ
రాత్రివేళ యెప్పుడే బొబ్బిలి కమ్మరీ
శక్తిశాలము యెత్తిపిడిచెను జాబురెల్లి కాడా
పాయక రాముని పేటలోపల కరాళిడేరాలు
అడవిబాటలో దిగినాడయ్యా టానా వెళ్ళినాడు
మల్లమ్మదేవి చెఱువుమీద మందులు పెట్టుతాడు
వెంగళరాయుడు వనమునందు యేనుగులగుంపుదా
రచ్చాబండ రేవులకాడ లాల్కాను డయిన
మంచినీళ్ళ బావులకాడ దుబాసిలక్షుమయ్య
పాతబొబ్బిలి పాటిమీదనే ప్రాంచిదిగినాడు

వ. పలువిధంబులుగ జగడంబుచేసి గుఱ్ఱములను ఏనుగులను చంపుచుండగ హైదరజంగోజి యనువాడు భయమునుజెంది జయించ లేమని నల్లమందుకు ఫ్రాంశీలబూచివద్ద సెలవుపొంది చుట్టుప్రక్కల పోసి జగడంబు సేయగ వుండని తెలియక తెల్లాబిడ్డలుదూకి చచ్చి నారు. అక్కడనుంచి బయలుదేరి వస్తున్నారు విజయరామరాజున్ను ఫ్రాంశీలబూచియు దండుపరివారముతో వస్తున్నారు.

గొల్లపల్లి కోనేటిలో రాజుడేరాదా
వచ్చేటప్పుడు వస్తున్నది రాణువలంతాను
యీరీతిగా దిగినారయ్యా రాణువలంతాను
యెటుప్రక్క చూచినా రాజుగారి డేరాలుండెను
నువ్వులుచల్లిన రాలదయ్యా దండుకు లోగాను
యీరీతిగా యున్నదయ్యా కోటకు లోగాను
అన్నిదళములు వచ్చియపుడే బొబ్బిలి కమ్మింది
యెండతగలక యెత్తినారయ్యా యెఱ్ఱడేరాలు
మంచుతగలక యెత్తినారయ్యా మైనపుడేరాలు
డేరాలోపల కొలువై యున్నాడయ్యా ఫ్రాంచిదొరగారు
అప్పుడెట్లా వున్నాడయ్యా ఫ్రాంచిదొరగారు
ఫ్రాంచివారి దండుకొడిదా యెత్తించినారు
రాజుగారి తెల్లజండా యెత్తించినారు
రాజుగారు డేరాలోపల కొలువై యున్నాడు
నిమిషంబుదా ఆలోచించెను విజయరామరాజు
ఫ్రాంచివారి డేరాకూడా అప్పుడు వచ్చెను
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
చిన్నపలుకు చిత్తగించుము ఫ్రాంచిదొరగారు
కోటకమ్మిన సంగతియిప్పుడు వింగయ్యా కై తేను
బొబ్బిలికోట రంగయ్యకు యిపుడే చేస్తమయ్యా
యీరీతిగా జెప్పినాడయ్యా విజయరామరాజు
అలాగే చేయుమనెను ఫ్రాంచిదొరగారు
పెద్దలనాటి నగారబల్ల చేతబట్టినాడు
ఢాండాంఢాం మని ఢంకా పలికేను
రణము రణము రణమంటూ నగారా పలికింది
ఫ్రాంచివారి లంజాయీలు పాటలు పాడినది

అప్పుడెట్లా వున్నారయ్యా బొబ్బిలిదొరలూదా
చంద్రశాల మండపమున రంగయ్య దొరగారు
పగడశాలలు ఆడినవెనుక సాముకు పోతాడు
సాముకుబోవు సమయమందున శబ్దమువిన్నాడు
తమ్ముడుయొక్క చంద్రశాలకే తానువచ్చినాడు
తట్టితట్టి లేపినాడయ్యా వెంగళరాయుణ్ని
కలవరపడి లేచినాడయ్యా వెంగళరాయుండు
వందనమయ్యా వందనమయ్యా రంగయ్య దొరగారు
యెన్నడు రానివారు యిప్పుడు యేలవస్తిరి
వేళకాని వేళయందు కోటకు వస్తిరి
యేమి అపాయం జెందెనయ్యా వీరబొబ్బిలికి
మీరువచ్చిన కార్యమేమి తెలియ జెప్పుమయ్య
ఈ రీతిగా పలికినాడు వెంగళరాయుడు
అప్పుడు రంగయ్య యేమంటారు వెంగళరాయునితో
యేమిజెప్పుదు యేమిజెప్పుదు వెంగళరాయుడా
సాయంత్రంవేళ కోటలక్రింద సవారిపోతిని
సద్దుచప్పుడి లేదయ్యా కోటల క్రిందాను
చంద్రసాల మంటపములో వెంగళరాయుడా
పగడశాల ఆడికేను సాముకు పోతిని
అప్పుడుమన కోటలక్రిందా నగార పలికింది
నగారశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయుడా
యిట్టిశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయుడా
ఈరీతిగా జెప్పినాడయ్యా రంగయ్యదొరగారూ
పరాకుంచక వినుము యిప్పుడు అన్నయ్య దొరగారు
రణభేరి శబ్దముగాదు రంగయ్యదొరగారు
మల్లమ్మదేవి చెరువుక్రింద కాపులువారుదా
కంబుల విత్తనాల్ చాలజల్లిరి అన్నయ్య దొరగారు
చేనుకాడ పిల్లకాయలు తుడుములు కొట్టినారు
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
ఆమాటకు తాళజాలక రంగయ్యదొరగారు
తుడుములుకాదు తుడుములుకాదు వెంగళరాయుడా
నగారశబ్దము వింటినయ్యా వెంగళరాయుడా

యీరీతిగా చెప్పినాడు రంగయ్యదొరగారు
పరాకుంచక వినుము యిప్పుడు వెంగళరాయుడా
తమ్ముడు మాటలు నమ్మలేక నే అన్నయ్య దొరగారు
అనంతబురుజు యెక్కిజూతాము వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడు రంగయ్యదొరగారు
చెయిచెయ్యితో పట్టడించి వస్తున్నారు
అనంతబురుజు యెక్కిరప్పుడు అన్నతమ్ములూ
జోడుకుర్చీ యచ్చటయప్పుడు వేయించినారు
కుర్చీమీద కొలువుదీరిరి అన్నతమ్ములూ
తెల్లవార వచ్చినదయ్యా బొబ్బిలి మీదాను
మల్లమ్మదేవి చెరువుప్రక్క కన్నుల చూచేను
పరాకులేక వినండిమీరు అన్నయ్య దొరగారు
పడమటిచేను ఆవులగుంపు పట్టంపోతాది
కట్టమీదనే మేతమేసి నిలిచి యున్నాది
కోటలక్రింద రంతుయేమి వెంగళరాయుడా
వుత్తరాది గొర్రెలగుంపు పట్టంపోతాది
కోటచుట్టు మేతలుమేసి నిలిచి యున్నాది
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు

వ. అక్కడనుంచి రాజుగారు ప్రాంశీలబూచినిచూచి మనము బొబ్బిలివారికి యెరుక చేస్తామని నగారశబ్ధముకొట్టగ ఆ శబ్ధము విని రంగారాయుడు కాపువారు తుడుములు గొట్టుతున్నారని రంగారాయుడితో జెప్పుతున్నారు వెంగళరాయుడు తుడుము కాదని అనంత బురుజు యెక్కి జూస్తున్నారు. అన్నతమ్ములు వెంగళరాయుడు రంగారాయుడు దానినిజూచి రంగారాయుడు ఆవులగుంపు అది పడమటి సీమకు పోతున్నదని జెప్పుతున్నాడు.

అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
పాతబొబ్బిలి పాటిమీదనే కంచులు వున్నాది
కంచులుమేసి పాటిమీదనే నిమ్మళించినాది
యిందాక యికయేమిలేదు అన్నయ్య దొరగారు
తెల్లవారి ప్రొద్దుపుట్టెను బొబ్బిలిమీదాను
నాలుగుప్రక్కల పారజూచెను రంగయ్యదొరగారు
ప్రాంచివారి తెలుపుజండా కన్నుల చూచేను

యిటుప్రక్క జూచినగాని గుర్రాల గుంపుదా
సందుబొందు జూచినగాని సానికత్తులుదా
కత్తరించి యున్నదయ్యా కండు యపుడుదా
యీరీతిగా వున్నాదయ్యా కోటల క్రిందాను

వ. ఇంతలో చక్కగ తెల్లవారేసరికి ప్రాంచివారి తెల్లజండా కనబడ్డది దానిప్రక్కన విజయరామరాజుగారి దండు ప్రెంచివారి సైన్యము కలసి తమకోటను ముట్టడించియుండుటను వారు కన్నుల జూచిరి

అప్పుడు యేమని జెప్పినాడు రంగయ్యా దొరగారు
పరాకుంచక వినుము యిపుడు వెంగళరాయుడా
పోరులేని బొబ్బిలిమీద పోరుగలిగింది
పెద్దలనాటి బొబ్బిలికిప్పుడు భోగము చెల్లింది
యిక్కడ యుండగదయ్యా బొబ్బిలికోటలో
రాజుగారితో మనమైతే జయించ జాలము
నల్లమందు గుండుతోను ప్రాంచివచ్చినాడు
నల్లమందు గుండుకుముందు కత్తియెత్తరాదు
చేతిలో యుద్ధము మనము యిక చేయలేము
కోటలకంతా బోరుసింహము పాపారాయుడు
రాజుయచ్చట వచ్చునని బాట కాచియున్నాడు
దొంగదోవల బాటజూచి తాను వచ్చినాడు
పాపారాయుడు యుంటేమనకు భయము లేదయ్యా
తలుపు తెరచి విడిచినటులయ్యె బొబ్బిలి కోటాలు
పాలుకోలు ముండ్యాలు మనము బాగు చేసుకొని
రాజస్త్రీల పిలచుకొని వల్సలు బోతామూ
ప్రాంచివచ్చి రాజుకు పట్టము గట్టిపోతాడు
వెనుకవచ్చి చంపలుగొట్టి బొబ్బిలి తీతాము
యీరీతిగా జెప్పినాడయ్యా రంగయ్యా దొరగారు
అన్నమాటలు విన్నాడయ్యా వెంగళరాయుండు
యెక్కడలేని కోపమువచ్చె వెంగళరాయుడికి
మండివేసి కొలువుతీరెను వెంగళరాయుండు
హీనపుమాటలు పల్కవద్దు అన్నయ్యా దొరగారు
భీతియిప్పుడు జెందవలదు అన్నయ్యా దొరగారు
రాజస్త్రీల తీసుకొని వల్సలు పోతేను

పడమటిసీమ మెలమాదొరలు సవ్వర వింటేను
చుట్టుప్రక్కల రాజులువింటే హేళనము గాదయ్యా
మానము పోయిన పిమ్మటయిట్టి ప్రాణమెందుకయ్యా
రామరామ యనంతకాలము రాజ్యమేలుతామా
జంగమువుండు కాలమువరకు వుండదము లేదు
యెన్నిదినములు బ్రతికినగాని చావుసిద్ధమాను
ఆపత్తయిన వచ్చినయపుడు అన్నయ్యదొరగారు
ధయిర్యమంతయు విడువరాదు అన్నయ్యా దొరగారు
పిరికిమాటలు బలుకవలదు అన్నయ్యా దొరగారు
పర్యాలోంచక వినుము యిప్పుడు అన్నయ్యా దొరగారు
చాలుచాలు నీదుమాటలు అన్నయ్యా దొరగారు
రెండుఘడియలు సెలవిచ్చిమీరు నాలిమావజూడండి
పన్నెండేండ్లు సాముచేసితి సాధన గండిలో
సాముచేసిన రెట్టలకిపుడు బలము కలిగిందీ
లాయము నందుండు కారాతేజికి సవారి గలిగింది
తుక్కుబట్టిన పట్టాకత్తులకు తుక్కులు వదలిందీ
యొలనయుండు పచ్చలబాకు బట్టుక బెజికేను
ఉడాను వేసి భూమినదూకెను వెంగళరాయుడు
తమ్మునియొక్క కోపమును కన్నుల జూచెను
కౌగలించి పట్టినాడయ్యా వెంగళరాయుణ్ని

వ. ఫ్రెంచివారికి నల్లమందు గుండ్లును చేతి జగడము పనికిరాదనియు, రాజారంపుబాటలో కాచియున్న బొబ్బిసింహాం పాపారాయుణ్ని తప్పించి దొంగదోవగా వచ్చియున్నారనియు పాపారాయుడుంటే మనకు భయములేకనియు ఈ ఆపత్సమయమున మన స్త్రీలను వెంటబెట్టుకొని వల్సలుపోయి సమయము కనిపెట్టి మరల మనబొబ్బిలి కోటలను వశపరచుకొనవచ్చునని అన్నరంగారాయుడు చెప్పగా విన్న వెంగళరాయుడు రోషము పట్టలేనివాడై మానము పోయినవెనుక బ్రతికియుండుట సరిగాదనియు నాకు సెలవిచ్చిన రెండు ఘడియలలో శత్రుసైన్యములను చెండాడెదనని వీరావేశంబున జెప్పుచున్నాడు.

తామసించుము తామసించుము వెంగళరాయుడా
అవసరపడితె పనులుకాదుర వెంగళరాయుడా

దామర్ల వారి ధర్మారాయుని సంధికి పంపితే
రాయభారము తీర్చుకొనిదా రాయుడు వస్తాడు
రాయభారము కుదరకపోతే పిమ్మట చూతాము
యీరీతిగా పలికినాడయ్యా రంగయ్యాదొరగారు
పరాకుంచక వినుమయిపుడు అన్నగారుమీారు
అచ్చటనుండి వస్తున్నారు అన్నతమ్ములూను
తనుగొల్చే రాణువలంతా కొలువుకు వచ్చేను
బండిరి రామానాయుడు కొలువుకు వచ్చేను
ముత్యాలవారి పాపారాయుడు కొలువుకు వచ్చేను
పటాలవారి రామన్న కొలువుకు వచ్చేను
దామర్లవారి ధర్మారాయుడు కొలువుకు రాలేదు
పిలువుమయ్యా పిలువుమయ్యా ధర్మారాయుణ్ని
యీలాగు చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
హర్కారులను పిలిచినారయ్యా రంగయ్యాదొరగారు
ధర్మారాయుడు కొలువుకురాని కారణంబేమో
వెంటనేపోయి ధర్మారాయుని పిలుచుకరండి
ఆమాటలే విన్నారయ్యా హర్కారులపుడు
పరుగుపరుగున వస్తున్నారు హర్కారులపుడు
ధర్మారాయుడు జేటికివచ్చిరి హర్కారులపుడు
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
బావగారు రంగయ్య మిమ్ము పిలువమన్నారు
యీరీతిగా జెప్పినారండి హర్కారు లపుడుదా

వ. తమ్మును వెంగళరాయుని కోపమునుచూచి అవసరపడితే పనులు కావనియు, ధర్మారాయుని రాయభారము పంపినయెడల అతడు సంధి కుదుర్చుకొని రాగలడు అట్లు సంధి కుదరకపోతే పిమ్మట జూతామని అన్నదమ్ము లిరువురును కచ్చేరికివచ్చి కొల్వుతీరగా సరదారు లందరు వచ్చిరిగాని దామర్ల ధర్మారాయుడు కొల్వుకు రాకపోగా అతనిని పిలుచుకరమ్మని హర్కారులను పంపుచున్నారు.

యెందుకునన్ను పిలువమన్నారు బావగారిపుడు
యెట్లుచెప్పను మాకు తెలియదు ధర్మరాయుడా
బావగారి ముందుకువచ్చి వందన మొసగేను
యేలనన్ను పిలిపించినారుగ బావగారిపుడు

వ. రంగారాయుడిగారి కొల్వునకువచ్చిన ధర్మారాయుడు బావ గారికి వందనములుచేసి తన్ను పిల్పిన కారణమేమని యడుగగా,

అప్పుడేమని చెప్పినాడుగ రంగయ్యదొరగారు
యేమనగా యేమనిజెప్పుదు ధర్మారాయుడా
రాజుగారికి మనకు నిండు పగలు గలిగెను
తూర్పుదేశం చూడను ఫ్రాంచిదొరగారు
పుదుచ్చేరి యేలేటివాడు ఫ్రాంచిదొరగారు
యిరువైనాలుగు వేలదండుతో ఫ్రాంచివచ్చినాడు
రాజుగారికి ఫ్రాంచిదొర తాకీదంపేను
యెదురుసేవకే రమ్మని తాకీదంపేను
తాకీదపుడు చూచుకొని విజయరామరాజు
వెంగళరాయుడు పేరిట యపుడు జాబులువ్రాసేను
జాబునపుడు చేతికిచ్చిరి వెంగళరాయుడికి
జాబులోని సంగతులన్ని కన్నుల చూచేను
చదివినట్టి జాబులను చించివేసినాడు
చించినట్టి జాబులను తగలబెట్టినాడు
జాబుతెచ్చిన హర్కారులను చెంపలుగొట్టినాడు
మెడనుబట్టి బయటదోసెను వెంగళరాయుడు
ఘోరుఘోరున దుఃఖపడిరి హర్కారు లపుడుదా
విజయనగరము చేరినారయ్యా హర్కారు లపుడుదా
యీ సంగతులంత రాజుతో మనవిచేసినారూ
రాజుగారు కోపముజెందె అట్టివేళలోను
కోటమీదికి దండుతెచ్చెను విజయరామరాజు
దేశము తెలియని ఫ్రాంచిగారు దేశమువచ్చిరీ
నల్లగుండు మందుతోను ఫ్రాంచివచ్చినాడు
నల్లమందుతోను పోట్లాడుతారు ఫ్రాంచిదొరలుదా
నల్లమందుకుముందు పోట్లాడగలమూ మనమేమైతేను
నల్లమందు గుండుకుముందు మనము నిల్వలేము
రాయభారము పోవలెనయ్యా ధర్మారాయుడా
ఆమాటకే కోపముజెందె ధర్మారాయుడు
వెంట్రుకలంత విదిలింది రాయుడికైతేను
చాలుచాలు నిలుపుమయ్యా రంగయ్యదొరగారు

వూసపాటి బేటికినన్ను పొమ్మంటారా
ప్రాణముతోను రాజుబేటికి నేను పోనయ్యా
జగడమునకు పొమ్మంటేను నేను పోతాను
యింతపనిదా నేనుజేతును బావయ్యా దొరగారు
యిట్టిమాటలు చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యా దొరగారు
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
రాజుగారి బేటికినీవు యిపుడే పోవద్దు
ఫ్రాంచివారి డేరాకు నీవే పోవయ్యా
రాయభారము చెప్పినీవు రాయిగ రన్నండి
యిన్నిమాటలు జెప్పినాడయ్యా రంగయ్యాదొరగారూ
అప్పుడేమని జెప్పినాడు రంగయ్యాదొరగారూ
పరాకుంచక వినుమూయిపుడు రంగయ్యాదొరగారు
కీకరభాకర భాషాలయితే ఫ్రాంచివారిదీ
కల్లుసారాయి త్రాగివారు కయిపు వుంటారు
తూగిపడుతు యుంటాడయ్యా ఫ్రాంచిదొరగారు
సంధిమాటలు యేలాగు నేను జెప్పవత్తునయ్యా
యీలాగున చెప్పినాడయ్యా ధర్మారాయుండు
పరాకుంచక వినుముయిపుడు ధర్మారాయుడా
బందరులోని కాపురస్తుడు దుభాసిలక్ష్మయ్యా
నాలుగు చదువులు చదివినాడు దుభాసిలక్ష్మయ్యా
లక్ష్మయ్యా డేరాచెంతకు సంధికి పొన్నండి
యెంతపైకము యడిగినాను కానుకతియ్యావద్దు
యిచ్చట వచ్చినందుకు లక్షలు యిస్తాము
మజిలీకొకటికి లక్షపైకము మేమేయిస్తాము
మందుసెలవులు సిబ్బందిసెలవులు యినాము లిస్తాము
వందలకొలది బత్తాయిసారాయి సెలవుల కిస్తాము
అంబారిగట్టిగ యేనుగలు యినాములిస్తాము
పొమ్మంటేను మంజ్యాలభూమికి యిపుడేపోతాము
కార్యమందు వంచనలేదు బొబ్బిలివారికి
యీతూరి మన్నించుమయ్యా బొబ్బిలివారిని
బాలింత పసిబిడ్డలతోటి కోటలో యున్నాము

ముసలి ముతకలతోను కోటలో యున్నాము
రాజుమాటలు వినేదిమీకు న్యాయము గాదయ్యా
రాజుగారికి మాకుచాలా పగలు యున్నాది
పెద్దలనాటి పగలూమాకు పెరుగుతున్నాయి
మాకుమీకు పగలులేదు దుభాసిలత్మయ్యా
తూర్పుదేశం చూడను యిపుడు మీరేవచ్చితిరి
కర్ణాటక రాజులతోను కలహము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతి కోటకుపొన్నండి
ఈతూరి మన్నించుము బొబ్బిలి కోటాను
మేముయిచ్చే వుల్బాలన్ని తీసుకపొన్నండి
ఈలీరుగ జెప్పుమయ్యా ధర్మారాయుడా
రాయభారము కుదరకపోతే పిమ్మట చూతాము

వ. అప్పుడు రంగారాయుడుగారు ధర్మారాయునిజూచి యేమను చున్నారంటే, నీవు యిప్పుడు రాజుగారి బేటికిపోవద్దు ప్రాంచిదొర బేటికి పోవలసినదనియు వారిభాష మనకు తెలియదు గనుక అచట వుండు దుభాసిలత్మయ్యను జూచి మాటలాడి అతడెంతపైకమడిగిన యిస్తామనియు బిడ్డలు, పాపలు, బాలింతలు, ముసలిముతకలతో కోటలో యున్నామనియు రాజుగారికి మాకు చాలరోజులుగ పగ యున్నదనియు, ప్రాంచివారికి మాకు పగలేదనియు తూర్పుదేశాలను జూడవచ్చినవారు గనుక మీరు మాతోడ జగడమునకురాక మేమిచ్చు బహుమతులను గైకొని మాబొబ్బిలికోటను మన్నించి మీవూరికి పోవలసినదనియు జెప్పి సంధి కుదుర్చుకొని రావలసినదనియు అట్లు రాయభారము కుదరకపోతే పిమ్మట చేయవలసిన కార్యమేమో చూస్తామన్నాడు.

సెలవులుపొంది వస్తున్నాడు ధర్మారాయుండు
తులసినందన వనములోకి కదలి వచ్చినాడు
నందవనములో చల్లగాను తీర్థమాడినాడు
ఆరుఘడియలు అంబపూజ మూడుగళ్లు చేసి
హరిపూజ శివపూజ తాను తీర్చుకొని
తట్టుకోటలో గోపాలస్వామిని మదిలో దలచెను
రాజదివాణము వచ్చినాడు ధర్మారాయుండు
పంచభక్ష్య పరమాన్నములతోను అన్నము తినెను

విడియము లపుడు చేతికందెను ధర్మారాయుండు
తన్నుగొలిచె రాణువలంత తాను పిలిచినాడు
అన్నలార తమ్ములార యల్లాబిడ్డలారా
ప్రాంచివారి జేరాచెంతకు సంధికి పోతాము
నాతోకూడ రావలెనయ్యా యల్లాబిడ్డలార
ఈరీతిగా జెప్పినాడు ధర్మారాయుడు
మంచిదన్నారు బాగన్నారు యల్లాబిడ్డాలు
వారివారి విడిదికియపుడు కదలి వచ్చినారు
పంచభక్ష పరమాన్నముతో అన్నము తిన్నారు
జాజిపువ్వుల జల్లడములు జగ్గున దొడగిరి
గాసిమీరిన వీరగానులు నడుమున గట్టిరీ
వెండికట్టెలు సొగసుగవారు చేతబట్టినారు
చేతులయందు సోపుకర్రలు సొగసుగ బట్టినారు
తాలా పట్టాకత్తులవారి సంకన వేసిరీ
బంటుకు పన్నండాయుధములతో ప్రయాణమైనారు
ధర్మారాయుడు జేటికివారు పరుగున వచ్చిరీ
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
తామసంబు యింకాయేల తయారు గన్నండి
యీ రీతిగా జెప్పినారు యల్లాబిడ్డాలు
యల్లాబిడ్డల శృంగారింపు కన్నుల జూచాడు
ఘల్లుమని నవ్వినాడు ధర్మారాయుండు
అప్పుడేమని పలికినాడు ధర్మారాయుండు
భారా తేజిని యిపుడుమీరు బేటికి తెన్నండి
నేలమిద్దెలో భూమికాపులో తేజియున్నాది
శృంగారించి తీసుకరండి కొలువుకు యిప్పుడు
యీరీతిగా జెప్పినాడు ధర్మారాయుండు
పన్నెండుమంది కాపుదాదులు గొబ్బునవచ్చిరి
వేసినారు తేజికక్కడ వెండికళ్లెములూ
జడలల్లి జట్టుగుండ్లు సొంపుగ వేసిరీ
మెడమీద జట్టుగుండ్లు సొంపుగ నల్లిరీ
వుమాయిపీట కలికితురాయి చందమామచెక్క
పట్టుత్రాళ్ళతో గట్టినారయ్యా బారాతేజిని

తేజీయొక్క శృంగారము కన్నుల చూచేను
పాదములకు పూజించినాడు ధర్మారాయుండు
కూర్మికుచ్చుల పల్లకియపుడు బైటపెట్టినాడు
పల్లకిలోపల కొలువుతీరెను ధర్మారాయుడు
పన్నెండుమంది బోయవారు పల్లకిబట్టిరీ
పల్లకిపక్క వస్తున్నారు యల్మాబిడ్డాలూ
పల్లకిపక్క వస్తున్నాది బారాతేజీదా
హరిరామ శ్రీరామాయంటూ కోటవిడిచినారు
కోటగవినికి వచ్చియపుడు గోవిందం పెట్టిరీ
కోటదాటి వచ్చినాడు ధర్మారాయుడు
కత్తుల పారయపుడు దిరుగుతుయున్నాది
దొంగజోరువో పారలన్ని తిరుగుతు యున్నారు
మూడువేల ముకుందబల్యామ పారాయున్నాది
రెండువేల సోల్జరువారు పారాలున్నారు
నల్లమందు అనువులవద్ద పారాయున్నారు
అనువుకాడనే వచ్చినాడు ధర్మారాయుండు
ఆ వెంబడి వస్తున్నారు యల్మాబిడ్డాలు
ఆ వెంబడి వస్తున్నాది బారాతేజీదా
అనువులకాడ అటకాయించిరి ధర్మారాయుణ్ని
యెవరు యెవరు మీరుయిపుడు యెక్కడి కొచ్చితిరి
ఈ రీతిగా అడిగినారయ్యా పారాచౌకీలు
అప్పుడేమని చెప్పినాడు ధర్మారాయుండు
బొబ్బిలివారి దివానగిరి ధర్మారాయుణ్ని
బొబ్బిలివారి దివానమైతే యెందుకు వస్తివి
మీరువచ్చిన కార్యమేమి తెలియబలుకుమాకు
పోనీవమయ్యా పోనీవమయ్యా ధర్మారాయుడా
ప్రాంచివారి యుత్తరవులేక బాటలు విడువము
రాజుగారి యుత్తరంవులేక బాటలు యివ్వము
కిటకిటకిటకిటయని పారాకమ్మినాది
రెండువేల ముకుందబల్యాము పారాకమ్మినాది
పారామధ్య చిక్కినాడయ్యా ధర్మారాయుండు
అన్నలార తమ్ములార పారాచౌకీలు

యుద్ధమునకు వచ్చితే మీఆటకాయింపు చెల్లు
యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
ప్రాంచివారే డేరాచెంతకు సంధికి పోతాను
రాయభారము కుదిరితేను కోటకు పోతాను
రాయభారము కుదరకపోతే పారాచౌకీలు
మెచ్చరించి నేనుయపుడు కోటకు పోతాను
యుద్ధానికి రావలెనంటే కోటకు రన్నండి
వారివారి బలములు యచ్చట జూతాము
యింతేగాని యికనేమిలేదు పారాచౌకీలు
యీరీతిగా చెప్పినాడు ధర్మారాయుండు
పోనివ్వము పోనివ్వము ధర్మారాయుడా
రాజాగారి వుత్తరవులేక దోవలు విడువాము
ప్రాంచివారి వుత్తరవులేక దోవలు విడువాము
గుంపువచ్చి కమ్ముకున్నారు పారావారుదా
పారాలన్ని తోడుకొనిదా వస్తూవున్నాడు
వారివెంబడి వస్తున్నారు యులమాబిడ్డలు
యులమాలప్రక్క తిరిగిచూచెను ధర్మారాయుండు
కన్నుసైగ చేసినాడు ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినారు యుల్మాదొరలుదా
జగడమునకు రాలేదండి పారాచౌకీలు
చుట్టుకమ్మిన పారాలపుడు వస్తుయున్నారు
మంచినీళ్ళ బావికాడ పారాకమ్మెను
రాజయొక్క వురవడిజూచిరి పారాచౌకీలు
అక్కడక్కడ పారాలన్ని వెనుకకు తీసెను
అప్పుడెట్ల వున్నాడయ్యా దుబాసిలక్ష్మయ్య
డేరాబయిట కుర్చీమీద కొలువై యున్నాడు
పల్లకిమీద వచ్చేరాయుని కన్నుల జూచేను
వారినిజూచి దిగ్గునలేచి దుభాసి లక్ష్మయ్యా
యెదురుసేవకు యేడడుగులు ముందుగ నడిచేను
పల్లకిలోపల యుండేరాయుడు కన్నుల చూచేను
వుడానువేసి భూమిలో దూకెను ధర్మారాయుడు
యేడడుగులు ముందుకు నడిచెను ధర్మారాయుడు

వ. తన జేరాకువచ్చిన ధర్మారాయుని తగు మరియాదలతో ఎదుర్కొని పిలుచుకొనిపోయి యిరువురును కుర్చీలపై కొలువుతీరి, ధర్మారాయునిచూచి, మీరెవరు? యెందుకువచ్చినారని అడుగుచున్నాడు.

అప్పుడేమని చెప్పినాడు దుభాసి లక్ష్మయ్యా
యెవరుమీరు యెవరుమీరు జేరాకొచ్చితిరి
యీరీతిని పలికినాడు దుభాసి లక్ష్మయ్యా
రంగారాయుని భావమరిది ధర్మారాయుణ్ని
మాయింటిపేరు దామర్లవారు వినుము యిపుడుదా
ఈ విధంబున చెప్పినాడయ్యా ధర్మారాయుండు
యెందుకొస్తివి యేలవస్తివి ధర్మారాయుడా
దివానమొచ్చి దిగినందుకు జేటికి వచ్చితిమి
ఈ లాగున చెప్పినాడండి ధర్మారాయుడు
చాలుచాలు నిలుపుమయ్యా ధర్మారాయూడా
దివాణమంటె పర్వాయున్నదా బొబ్బిలి దొరలకు
దివాణమంటె భయమున్నదా రంగయ్యదొరలకు
అనకాపల్లెలో వుండేమేము జాబులు వ్రాసితిమి
యెదురుసేవకు రమ్మనిమీకు జాబులు వ్రాసితిమి
యెదురుసేవకు రాకపోతిరి బొబ్బిలి దొరలుదా
మీవంటి వారలకెంతో జాబులు పంపితిమి
జాబులుజూచిన తక్షణంబే ధర్మారాయుడా
యెదురుసేవకై మీరెవ్వరైన యెదురుగ వచ్చితిర
యీ విధంబున చెప్పినాడు దుభాసి లక్ష్మయ్యా
అప్పుడేమని జెప్పినాడు ధర్మారాయుండు
పరాకుంచక వినుమయిపుడు దుభాసిలక్ష్మయ్యా
మీరువ్రాసిన జాబులయితే మాకు చేరలేదు
మీరువచ్చిన సంగతులు మాకు తెలియకపోయే
వెంగళరాయుని పెండ్లియందు మేము వుంటిమి
నగారశబ్దము విన్నతోడనే జేటికి వచ్చితిమి
ఢంకాశబ్దము విన్నతోడనే జేటికి వచ్చితిమి
పరాకుంచక వినుముయిపుడు దుభాసి లక్ష్మయ్యా
రాజుగారికి మాకునింద పగలు యున్నాయి
మాకుమీకు పగలులేదు దుభాసిలక్ష్మయ్య

రాజుమాటలు వినుటమీాకు న్యాయము కాదండి
చిన్నబిడ్డలు చిరుబాలురతో కోటలో యున్నాము
కోటమీాద వచ్చుటయిపుడు న్యాయము కాదయ్యా
ఆరులక్షల పయికె మిపుడు అగావు లిస్తాము
యిచ్చట వచ్చినందులకు లక్ష యినాములిస్తాము
మజిలీయొక్కటి లక్షపయికము మేము గట్టుతాము
సిబ్బందిఖర్చు సెలవులంతా మేము గట్టుతాము
కర్ణాటకం చూడనురాజా మీారేవచ్చితిరి
కర్ణాటకం దొరలతో మాకు గల్భాయేలయ్యా
అంబారి పెద్దయేనుగు యినాము లిచ్చెదము
వచ్చినవారు వచ్చినరీతి వుడుచ్చేరికి పొన్నండి
నేను తెచ్చిన వుల్భాయలంతా మీారేయివ్వండి
యీాతూరి బొబ్బిలికోటకు చాల మన్నించండి
యీారీతిగా చెప్పినాడండి ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు దుభాసిలక్ష్మయ్య
రాజుమాటలు ఫ్రాంచిమాటలు యొకటైయున్నాది
రాజుగారికి బొబ్బిలికోట పర్మానిచ్చెను
చెప్పితేను తప్పేదిలేదు ఫ్రాంచిదొరగారు
సంధికి వచ్చినందుకుయేమి సాకము లేదయ్యా
వచ్చినవారు వచ్చినట్లు కోటకు పొన్నండి
రాజుగారికి పట్టంగట్టి ఫ్రాంచిపోతారు
వెనుకవచ్చి చంపలకొట్టి కోటను తియ్యండి
ఇంతేగాని యికయేమిలేదు ధర్మారాయుడా
యీారీతిగా చెప్పినాడయ్య దుభాసిలక్ష్మయ్యా
యెక్కడలేని కోపమువచ్చె ధర్మారాయుడికి
పటపటయని పండ్లుకొరికెను ధర్మారాయుండు
పరాకుంచక వినుముయిపుడు దుభాసిలక్ష్మయ్యా
యొకరిపట్నము యొకరికికట్టుటకు యెవ్వరికోడుకయ్య
రాజమహేంద్రం జిల్లాలోనే ఫ్రాంచిదొరగారు
రాజుగారికి బొబ్బిలికోటలు పర్మానిచ్చేను
రాజుగారికి పట్టంకట్టి తానేపోతాడు
యెవరిపట్నం యెవరికికట్టను యేమి సొంతము

యేమిధైర్యము యెక్కడిధైర్యము ప్రాంచిగారికి
పుట్టినచోట చావడానికి బ్రహ్మవ్రాయలేదూ
బొబ్బిలిమీద చావడానికి బ్రహ్మవ్రాసేను
చెప్పితేనూ తప్పేదిలేదా ప్రాంచిదొరగారు
అటువంటి నీతిపురుషుడా ప్రాంచిదొరగారు
పుదుచ్చేరి యిపుడేకదా రాజువారి కయితే
రాజుగారికి ఆపట్నమే పట్టము గట్టరాదా
బొబ్బిలివారి పట్నంగట్టి పోవచ్చినాడా
తనలోతాను తామసించుకొని ధర్మారాయుండు
పరాకులేక వినుము యిపుడు దుభాసిలక్ష్మయ్యా
వ్రాసిస్తె సంతోషమాయె దుభాసిలక్ష్మయ్యా
ప్రాంచికినాకు బేటిచేయించు దుభాసిలక్ష్మయ్యా
యొకటిరెండు మాటలునేను మాటలాడిపోతా
రాయభారము కుదిరితేను కోటకు పోతాను
యీరీతిగా పలికినాడయ్యా ధర్మారాయుడు
ప్రాంచీనీకు బేటికె యిస్తె నాకేమిస్తావు
ఆ మాటలకే నవ్వినాడు ధర్మారాయుండు
లంచముతీసే బుద్ధులునీవు మానక పోతివి
చేతనున్న పచ్చలకడ్ర చేతనిచ్చేను
రెండుసంచుల వరాలుయపుడు నజరు పోసినాడు
అచ్చాబాదరు యన్నాడయ్యా దుభాసిలక్ష్మడు
యెందుకు దొరలు బేటికివచ్చి యిట్లులేదయ్యా
నీవురాగను భయముగనున్నది దండుకులోగాను
ఆమాటలకు యేమన్నాడు ధర్మారాయుండు
నాకుమించిన వారున్నార దండుకు లోగాను
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
కల్లు సారాయిత్రాగి కయాపున వుంటాడు
వాళ్లుతెలియక పలుచియుంటును ప్రాంచిదొరగారు
కుర్చీమీద తూగుతువుంటుడు ప్రాంచిదొరగాడు
ప్రాంచివారి డేరాకుపోయి నేనేవచ్చెదను
ఘుషియసేపుదా నిదానించుము నాడేరాలోగా
మంచిదన్నాడు యపుడు ధర్మారాయుండు

యెచ్చటనుంచి ప్రమాణయానావు దుభాసిలక్ష్మయ్యా
గరుడపచ్చల పల్లకీమీద వస్తాయున్నాడు
ప్రాంచివారి డేరాదెంత టాకీలయినారు
అప్పుడెట్లవున్నాడయ్యా ప్రాంచిదొరగారు
తీనియపుడు తింటున్నాడు ప్రాంచిదొరగారు
పల్లకీవిడచి యెదురుగవచ్చెను దుభాసి లక్ష్మయ్యా
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
సలామనగా టోపీయెత్తి సలాము చేసెను
బయిటోకూనగా నోటవుత్తీరెను దుభాసిలక్ష్మయ్యా
యెందుకు యిచ్చట వచ్చినావు దుభాసిలక్ష్మయ్యా
ఈరీతిగా యడిగినాడయ్యా ప్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నాడు దుభాసిలక్ష్మయ్యా
పరాకుంచక వినండియిపుడు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి నివాసమునకు ధర్మారాయుండు
రాయభారమే వచ్చినాడు ప్రాంచిదొరగారు
తీనియపుడు తింటున్నాడు ప్రాంచిదొరగారు
పచ్చలకుర్చీ వేయించుమనె ధర్మారాయునికి
యెదురుసేవకు వీడుకుండవండి మానదుగ యిపుడుత
చెయ్యిలోన చెంబుబట్టి డేరాకు పిలవండి
యిరువురువారిక్కి కుర్చీపైన కొలువు తీరండి
వాళ్లమాటచి యేమాటయిన నేనుచెప్పితేను
ఒప్పియుండెడి వాడు కాడు ధర్మారాయుండు
సరదారిబిడ్డ వాడేనయ్యా ధర్మారాయుండు
సరియాత చేయకపోతే ప్రాంచిదొరగారు
డేరాలోనను గోరీపట్టి కోటకు పోతాడు
ఈ రీతిగా జెప్పినాడయ్యా దుభాసి లక్ష్మయ్యా
ఆమాటలు వినిచెప్పెను ప్రాంచిదొరగారు
యెంతమందిని తెచ్చినాడయ్యా ధర్మారాయుడు
ధర్మారాయుడు పేరుజెప్పగనే రొమ్ములుండుపగిలె
పరాకుంచక వినుమా యిపుడు ప్రాంచిదొరగారు
ఈరీతిగా పలికినాడు దుభాసి లక్ష్మయ్యా
దానికేమని పలుకుతాడుగ ప్రాంచిదొరగారు

అట్లయితే మీరే చెప్పండి దుభాసిలచ్చన్నయ్యా
పరాకుంచక వినుమయిపుడు ఫ్రాంచిదొరగారు
యాబైముగ్గురు యలమలతో అనడే వచ్చేను
ఆమాటలు విన్నాడయ్యా ఫ్రాంచిదొరగారు
గడగడగడగడ వణికినాడు ఫ్రాంచిదొరగారు
ఆరునిమిషంబులు తీసినాడు ఆరణి బత్యారి
మూడునిమిషంబుల తీసినాడు మూడేసుర్గతులు
యాబైముగ్గురు యలమలతో రాయుడువస్తాడు
పరాకుంచక వినుమయిపుడు దుభాసిలచ్చుడు
అయిదుగురితో రమ్మనిచెప్ప నాడేరాలోగాను
తక్కినవారిని నీడేరాలోగ తాయిగపెట్టండి
యీరీతిగా జెప్పినాడు ఫ్రాంచిదొరగారు
ఆ మాటలు విన్నాడయ్యా దుభాసిలచ్చుడు
గరుడపచ్చల పల్లకియెక్కి తాను వచ్చినాడు
రాయుడిచేటికి యెదుటవచ్చి దుభాసిలచ్చన్నయ్యా
పోయినపనులు యేమాయెను దుభాసిలచ్చన్నయ్యా
పరాకులేక వినుము యిపుడు ధర్మారాయుడా
ఫ్రాంచివారి డేరాకావును నేను పోతిని
చెప్పవలసిన మాటలన్ని నేనే చెప్పితిని
అయిదుగురితో రమ్మన్నాడు డేరాలోగాను
కొందవమందిని నాడేరావద్ద వుంచమన్నాడు
ఈ రీతిగా వృత్తాంతపు తెలిస్తి ధర్మారాయుడా
సంతోషించి నిలిచెనయ్యా ధర్మారాయుడు
యాబై ముగ్గుర యలమదొరల యేర్పరచినాడు
ఇన్మాటయొక్క సరదారిబిడ్డగా యేర్పరచినాడు
అయిదుగురు యలమబిడ్డల యేర్పరచినాడు

వ. ఆ యాబైముగ్గురు యలమబిడ్డలను యేర్పరచి తన వెంట తీసుకొని తక్కినవారిని దుభాసిలచ్చన్నయ్య డేరాకాపుననే నిలిపి ఫ్రాంచివారి డేరాకు వెళ్లుచున్నాడు ధర్మారాయుడు అతి సంతోషమున

పరాకుంచక వినండిమీరు యలమదొరలుదా
ఫ్రాంచివారి డేరాకునేను సంధికి పోతాను
నాతోకూడా రమ్మండయ్యా యలమదొరలార

యిట్టిమాటలు చెప్పినాడు ధర్మారాయుండు
అయిదుగురు యల్మాదొరలును వెంటతీసుకోని
కూరిమికచ్చుల పల్లకెక్కెను ధర్మారాయుండు
పల్లకియెక్కి వస్తున్నాడు ధర్మారాయుండు
పల్లకివెంబడి వస్తున్నాది బాకాతేజీదా
పల్లకి కమ్మినారు యలమాదొరలుదా
యీవిధంబున బయలుదేరెను ధర్మారాయుడు
అప్పుడేమని చెప్పినాడు ధర్మారాయుడు
అన్నలార తమ్ములార యలమాదొరలార
ప్రాంచివారి డేరాతావుకు సంధికిపోతాను
రాయభారము కుదిరితేను కోటకు పోతాము
కానిపోని మాటలవలన కలహాం వస్తేను
చేతనుండు డేగనుమీరు కోటకు విడిచిదా
క్రిందుమీదుగ చెయ్యండయ్యా ప్రాంచిడేరాలు
బాకువల్ల డేరాలంత కాయిగ చింపండి
ఈరీతిగా చెప్పినాడండి ధర్మారాయుడు
అచ్చటనుండి వస్తున్నాడు ధర్మారాయుడు
ప్రాంచిగారి గుడారంజూచి వస్తూవున్నాడు
అతని వెంబడి వస్తున్నాడు దుభాసిలక్ష్ముడు
రాయుడువచ్చు వేగము ప్రాంచిదొరగారు
గడగడ వణకి తాను నిలిచె ప్రాంచిదొరగారు
టోపీమెత్తి చేతబట్టి ప్రాంచిదొరగారు
యెదురు సేవకు యెడదుగులువచ్చె ప్రాంచిదొరగారు
మూడుమారులు సలాము చేసే ప్రాంచిదొరగారు
అప్పుడేట్లా వున్నాడండి ధర్మారాయుండు
పల్లకివిడిచి ధర్మారాయుడు భూమిని దూకేను
చేతిలో చేయిబట్టి డేరాకు వచ్చేను
కుర్చీమీద కొలువుతీరెను ధర్మారాయుడు
ఆవెంబడి వస్తున్నాడు దుభాసిలక్ష్ముడు
ధర్మారాయుడికి సాయీలైనాడు దుభాసిలక్ష్ముడు
ఇంగిలీషుతో చెప్పుతున్నాడు దుభాసిలక్ష్ముడు
రాజుమాటలే వినేదిమీకు ధర్మము కాదండి

రాజుగారికి బొబ్బిలివారికి పగలేయున్నాది
బొబ్బిలివారికి మనకూ యిపుడు పగలు లేదండి
కాలనాటి పగలు యిపుడు తూగుతూ యున్నాది
తూర్పుదేశము చూడను యిపుడు మనమేవస్తిమి
కర్ణాటక దొరలకావున కలహాము లేకుండా
వచ్చినటుల పోదామండి కోటకు యిపుడుదా
బొబ్బిలికయితే వచ్చినందుకు మూడులక్షలుదా
ఆరులక్షల పయికమిపుడు ఆగావు కదుకారు
ఇక్కడొచ్చినందుకు మనకు యినాము లిచ్చెదరు
మజిలీ మజిలీకైనా లక్షలు యిచ్చేరు
సిబ్బందిఖర్చు సెలవులంతా వారేయిచ్చేరు
అంబారి గొప్పయేనుగ యినాము లిచ్చేరు
యీతూరి మన్నించుకాము బొబ్బిలి కోటాను
పరాకుంచక వినండిమీరు ఫ్రాంచిదొరగారు
గోల్కొండ భాషావిన్నా మాటలు వచ్చాను
కర్ణాటక దొరలకావున కలహాము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతిగ మనమే పోదాము
యీరీతిగా జెప్పినాడు దుభాసి లక్ష్మయ్య

వ. దుభాసిలక్ష్ముడు చెప్పిన మాటలను ఫ్రాంచి ఆలకించి విజయరామరాజు తన్ను నమ్మివచ్చినాడు కావున రాజుకును వీరికిని సంధికుదిరితే అటులేమనము ఆ క్షణము పుదుచ్చేరికి వెళ్ళగలమని చెప్పినారు.

అట్టిమాటలకు యేమన్నాడు ఫ్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు దుభాసిలక్ష్మడా
నన్నునమ్మి వచ్చినాడు విజయరామరాజు
రాజుకావుకు సంధికియపుడు ధర్మారాయుణ్ని
రాజుగారు ధర్మారాయుడు స్నేహితమై తేను
యీ క్షణమే పోదామయ్యా పుదుచ్చేరికిదా
యింకేగాక నిక వేరేలేదు దుభాసిలక్ష్మడా
ఈ రీతిగా చెప్పినాడురా ఫ్రాంచిదొరగారు
అట్టిమాటలు తెలుసుకొన్నాడు ధర్మారాయుడు
చాలుచాలు లేచిపోవోయి ఫ్రాంచిదొరగారు
ప్రాణముతోను రాజుకావుకు నేనేపోనండి

యిట్టిమాటలు చెప్పినాడు ధర్మారాయుండు
అయిదుగురు యల్మాదొరలును వెంటతీసుకోని
కూరిమికుచ్చుల పల్లకెక్కెను ధర్మారాయుండు
పల్లకియెక్కి వస్తున్నాడు ధర్మారాయుండు
పల్లకివెంబడి వస్తున్నాది బాతాతేజీదా
పల్లకి కమ్మినారు యలమాదొరలుదా
యీవిధంబున బయలుదేరెను ధర్మారాయుడు
అప్పుడేమని చెప్పినాడు ధర్మారాయుడు
అన్నలార తమ్ములార యలమాదొరలార
ప్రాంచివారి డేరాతావుకు సంధికిపోతాను
రాయభారము కుదిరితేను కోటకు పోతాము
కానిపోని మాటలవలన కలహం వస్తేను
చేతనుండు డేగనుమీరు కోటకు విడిచిదా
క్రిందుమీదుగ చెయ్యండయ్య ప్రాంచిడేరాలు
బాకువల్ల డేరాలంత తాయిగ చింపండి
ఈరీతిగా చెప్పినాడండి ధర్మారాయుడు
అచ్చటనుండి వస్తున్నాడు ధర్మారాయుడు
ప్రాంచిగారి గుడారంజూచి వస్తూవున్నాడు
అతని వెంబడి వస్తున్నాడు దుభాసిలత్మ్ముడు
రాయుడువచ్చు వేగము ప్రాంచిదొరగారు
గడగడ వణకి తాను నిలిచె ప్రాంచిదొరగారు
టోపీమెత్తి చేతబట్టి ప్రాంచిదొరగారు
యెదురు సేవకు యేడడుగులువచ్చి ప్రాంచిదొరగారు
మూడుమారులు సలాము చేసే ప్రాంచిదొరగారు
అప్పుడేట్లా వున్నాడండి ధర్మారాయుండు
పల్లకివిడిచి ధర్మారాయుడు భూమిప దూకేను
చేతిలో చేయిబట్టి డేరాకు వచ్చేను
కుర్చీమీద కొలువుతీరెను ధర్మారాయుడు
ఆవెంబడి వస్తున్నాడు దుభాసిలత్మ్ముడు
ధర్మారాయుడికి పామాత్రైనాడు దుభాసిలత్మ్ముడు
ఇంగిలీషుతో చెప్పుతున్నాడు దుభాసిలత్మ్ముడు
రాజుమాటలే వినేదిమీకు ధర్మము కాదండి

రాజుగారికి బొబ్బిలివారికి పగలేయున్నాది
బొబ్బిలివారికి మనకూ యిపుడు పగలు లేదండీ
తాతలనాటి పగలు యిపుడు తూగుతు యున్నాది
తూర్పుదేశము చూడను యిపుడు మనమేవ స్తిమి
కర్ణాటక దొరలతావున కలహాము లేకుండా
వచ్చినటుల పోదామండి కోటకు యిపుడుదా
బొబ్బిలికయితే వచ్చినందుకు మూడులక్షలుదా
ఆరులక్షల పయికమిపుడు ఆగావు కడుతారు
ఇక్కడొచ్చినందుకు మనకు యినాము లిచ్చెదరు
మజిలీ మజిలీకై నాలక్షలు యిచ్చేరు
సిబ్బందిఖర్చు సెలవులంతా వారేయిచ్చేరు
అంబారి గొప్పయేనుగ యినాము లిచ్చేరు
యీతూరి మన్నించుతాము బొబ్బిలి కోటాను
పరాకుంచక వినండిమీరు ప్రాంచిదొరగారు
గోల్కొండ భాషావిన్నా మాటలు వచ్చాను
కర్ణాటక దొరలతావు? కలహాము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతిగ మనమే పోతా ము
యీరీతిగా జెప్పినాడు దుభాసి లక్ష్మయ్య

వ. దుభాసిలక్ష్మడు చెప్పిన మాటలను ప్రాంచి ఆలకించి విజయరామరాజు తన్ను నమ్మివచ్చినాడు కావున రాజుకును వీరికిని సంధికుదిరితే అటులేమనము ఆ లక్షణము పుదుచ్చేరికి వెళ్ళగలమని చెప్పినారు.

అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుము యిపుడు దుభాసిలక్ష్మడా
నన్నునమ్మి వచ్చినాడు విజయరామరాజు
రాజుతావుకు సంధికియపుడు ధర్మారాయుణ్ణి
రాజుగారు ధర్మారాయుడు స్నేహితమై లేను
యీ లక్షణమే పోదామయ్యా పుదుచ్చేరికిదా
యింతేగాక నికవేరేలేదు దుభాసిలక్ష్మడా
ఈ రీతిగా చెప్పినాడురా ప్రాంచిదొరగారు
అట్టిమాటలు తెలుసుకొన్నాడు ధర్మారాయుడు
చాలుచాలు లేచిపోవోయి ప్రాంచిదొరగారు
ప్రాణముతోను రాజుతావుకు నేనేపోనండి

సెలవిచ్చితే సంతోషమాయె ప్రాంశీలబూచి
సెలవులుమైన నివ్వకపోతె ప్రాంశీలబూచి
లక్షాతొంబై వేల దళములతో మీరు వచ్చినారు
ఇరువై నాలుగు వేల దలములతోను రాజువచ్చినాడు
యేబై ముగ్గురు యలమదొరలతో నేనువచ్చినాను
నీమందుగుండు హర్కారులను దూరంగ పెట్టండి
అంబారి యేనుగమీద అవుదా పన్నింతూ
అవుదాలోపల ముత్యాలపందిళ్లు ముందుగ వేయిస్తు
అవుదాలోపల కొలువువై యుండు ప్రాంశీలబూచి
రాజువారి సయిన్యమంతా పిరారు త్రిప్పించి
నాయొక్క సైన్యములన్ని బారు త్రిప్పించి
రాజుసైన్యమునకు నాసైన్యమునకు లడాయి పెట్టండి
లడాయి పెట్టి తమాషనిపుడు కన్నుల చూడండి
రాజగారు గెలిచితే బొబ్బిలికోట రాజుకు నివ్వాండి
నేను గెలిచితె విజయనగరము నాకేనివ్వండి
ఇంతేగాక యిక యేమిలేదు ప్రాంచిదొరగారూ
పరాకుంచక వినుమువిపుడు ప్రాంచిదొరగారు
మాకుమీకు పగలులేదయ్యా ప్రాంచిదొరగారూ
రాజుమాటలు వినేదిమీకు ధర్మము కాదండి
కోటమీద వచ్చేదిమీకు న్యాయము కాదయ్యా
బాలింత ముసలి ముతకలతోటి కోటలో యున్నారు
పసిబాలలతోను కోటలో యున్నారు
ఈరీతిగా జెప్పినాడయ్యా ధర్మారాయుండు
యెన్నిమాటలు జెప్పినగాని ప్రాంచిపిన లేదు
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
చాలుచాలు లేచిపోవోయి ధర్మారాయుడా
నమ్మివచ్చిన వానిని నేను ద్రోహము చేయను
నా చేతితో వానిని నేను పట్టిచూపను
పాలకొండ మండ్యాలభూమి బాగు చేసుకొని
మీస్త్రీలను తీసుకోని వల్సలు పొన్నండి
వారికి పట్టముగట్టినేను పుదుచ్చేరికి బోతాను
అవతలవచ్చి కెంపలుకొట్టి కోటలు తీయ్యండి

ఇంతేగాని యిక యేమియు లేదు ధర్మారాయుడా
చెప్పితేను తప్పేది లేదు ప్రాంచిగుంపుదా
ఆమాటకే కోపంబు గలిగే ధర్మారాయునికి
వెంట్రుకలంతా ఝుట్లుమనియెను ధర్మారాయుడికి
కుర్చీవిడిచి భూమినదూకెను ధర్మారాయుండు
చేతనున్న డేగానయితె కోటకు విడిచేను
డేగలాగు దూకినాడు డేరాకు లోగాను
డేరాకు కట్టిన టంగుత్రాళ్ళను బరబరకోసిరీ
బాకుమొత్తి చేతబట్టి డేరాను చించిరీ
వోరీయిప్పుడు చెప్పిలమాటలు మఱల జెప్పుమురా
రాజస్త్రీల తీసుకొని వల్సలు పోయెదా
ప్రాణములతోను పోయెదవా ప్రాంచనీవుదా
ఆడితేను తప్పేది లేదా మీరు అయితేను
అటువంటి సత్యవంతుడవా నీవు అయితేను
పుదుచ్చేరి రాజుగారికి పట్టము గట్టించి
నీదుస్త్రీలను తీసుకొని వల్సలు పోరాదా
యొకరియిల్లు యొకరికివ్వను యెవ్వరి కొడుకువురా
నిన్నునమి వచ్చినాడా విజయరామరాజు
వాని తాతతండ్రులు ముందుగ హతమై పోయారు
తుమ్మలగుంట యుద్ధమునాడు జగన్నాధరావు
లక్షాలక్షా దండులోను హతమై పోయినాడు
జలుజపాటి జగడమునాడు జగన్నాధరావు
ఏడువేల యేనూటిదండు హతమైపోయినాది
రాజుగారికి వ్రాతవ్రాసియున్నది బొబ్బిలిమీదాను
బొబ్బిలివారిచే చావడానికి పంతమున్నాది
పుట్టినచోట చావడానికి బ్రహ్మ వ్రాయలేదు
తట్టుకోటకు బలియిచ్చెద రాజువారినిదా
పన్నెండేండ్లు సాముచేసితి సాధన గరడిలో
లాయమందున్న బారాతేజికి లగువులు చిక్కింది
తుక్కపట్టిన పట్టాకత్తికి తుక్కులు వదలింది
ఈ రీతిగా బల్కినాడు ధర్మారాయుండు
మొలలోవున్న పచ్చలబాకు జర్రునతీసేను

కూసినకూత మరలయిపుడు కూయర ఫ్రాంచీడా
కూసిననోరు మూయకుండ నోటిలోపొడస్తారు

వ. ధర్మారాయుడి కత్తిమెరుపులను జూచి ఫ్రాంచి భయపడిన వాడై డేరా కంభముచాటున దాగినవాడై దుభాసి లక్ష్మునిజూచి తన్ను ఈ గండమునుండి తప్పించితే యతనికి మూడుపల్లెలు యినామిస్తానని ఇంగ్లీషులో జెప్పగా దుభాసిలక్ష్ముడు తనకుర్చీనుండి గొబ్బున దూకి ధర్మారాయుని వొకచేత అతని కత్తిని వొకచేతబట్టి యెప్పటి వలెనే బొబ్బిలికోట మీదేయంటున్నాడు ఫ్రాంచి నీవు యుల్మాబిడ్డలతోగూడి నాడేరా చెంతాగియుండుము నేను మంచిసంగతులు తెలుసుకొని వస్తానన్నాడు.

కత్తిమెరుపుల మెరిపించెను ధర్మారాయుండు
అప్పుడెటుల వున్నాడయ్య ఫ్రాంచిదొరగారు
ధర్మారాయుడు కత్తిమెరుపులే కన్నుల చూచేను
కత్తిమెరుపులే కన్నులచూచి కలవర పడినాడు
దిగులుజెంది నిలిచినాడు ఫ్రాంచిదొరగారు
కుర్చీవిడిచి ఫ్రాంచిగారు గొబ్బున దూకెను
డేరాస్తంభపు మరుగునబోయెను ఫ్రాంచిదొరగారు
అప్పుడేమని చెప్పినాడు దుభాసిలక్ష్ముడు
నమ్మితినయ్య నమ్మితినయ్య దుభాసిలక్ష్ముడా
ఘోరపులి తెచ్చి నీవు డేరాలో పెట్టితివి
నాదుపంతము తప్పిందా దుభాసిలక్ష్ముడా
మూడుపల్లెలు యినాము లిచ్చెద దుభాసిలక్ష్ముడా
యీలాగు ఇంగిలీషులో ఫ్రాంచి జెప్పినాడు
యీ మాటలు వినినాడు దుభాసి లక్ష్ముడు
కుర్చీవిడిచి దుభాసిలక్ష్ముడు గబ్బున దూకెను
గొబ్బునపోయి పట్టినాడు ధర్మారాయుణ్ని
చేతికత్తిని బట్టినాడు దుభాసి లక్ష్ముడు
శాంతించుర నిదానించుర ధర్మారాయుడా
యెప్పటివలెనే బొబ్బిలికోట దాగియున్నాది
కటకటమాటలు జెప్పినాడు దుభాసి లక్ష్ముడు
యెత్తినకత్తి దించుమీదనే శాయిగ పొడిచెను
చదురువిడిచి లేచినాడు ధర్మారాయుండు

డేరావిడిచి బైటకొచ్చెను ధర్మారాయుండు
యీబైముగ్గురు యిల్మాదారలను వెంటపిలిచెను
అప్పుడేమని జెప్పినాడు దుభాసి లక్ష్ముడు
పరాకుంచక వినుమయిపుడు ధర్మారాయుడా
కల్లుసారాయిత్రాగిన్నైన కయిపున వుంటాడు
మంచిసంగతులు తెలుసుకొని నేనువస్తాను
వొక్కనిమిషము నాడేరాచెంత మీారేయున్నండి
ఈరీతిగా జెప్పెనుయపుడు ధర్మారాయుణ్ని
తనడేరాచెంతకు పంపెనుయపుడు ధర్మారాయునితో
రాజుచెంతకు బోయినాడు దుభాసి లక్ష్ముడు
వందనమయ్యా వందనమయ్యా విజయరామరాజా
బొబ్బిలివారి దివాణమంట ధర్మారాయుండు
రాయభారము వచ్చినాడు ప్రాంచి దగ్గఱకు
రాయభారము వొప్పకపోతే ప్రాంచిదొరగారు
ప్రాంచివారిని నిరాకరించి కోటకు పోతాడు
తందుకులోగా పోతున్నాడు ధర్మారాయుడు
పన్నెండేండ్లు పోరుచేసిన కోటలు తియ్యాము
కోటలుపొడుగు పీనుగులుపడిన కోటలు తీయును
ఈవిధంబుగా పలికినాడు దుభాసి లక్ష్ముడు
ఆమాటలు విన్నాడయ్యా విజయరామరాజు
ధర్మారాయుడనగా గుండెలు తారున పగిలెను

వ. దుభాసిలక్ష్మయ్య ధర్మారాయుని తన డేరాచెంత వేచియుండ మని కపటపుమాటలు పలికి విజయరామరాజువద్ద వెళ్ళి ధర్మారాయుడు ప్రాంచిచెంతకు రాయభారము వచ్చెను సంధికుదరక, కోటకు మరలి పోవుచున్నాడని తెలుపగ ఆ సంగతినివిన్న విజయరామరాజు గుండెలు పగిలినవాడై ప్రాంచిచెంతకు పరుగునవచ్చి ధర్మారాయుని కోటకు పోనిస్తె తమకు తప్పక ముప్పొకలుననియు, అతని కోటకు పోనివ్వ గూడదని తెల్పగా ప్రాంచి సరే అటులే చేయుమంటాడు.

చదురువిడిచి లేచినాడు విజయరామరాజు
ప్రాంచివారి డేరాచెంతకు వస్తూవున్నాడు
రెండులక్షల వరహాలపుదు సదరు మెత్తుకొని
ప్రాంచివారి చేటికివచ్చి వందన మొనగేను

వందనమయ్యా వందనమయ్యా ఫ్రాంచిదొరగారు
ఈరీతిగా జెప్పినాడు విజయరామరాజు
రెండులక్షల వరహాలపుడు సదరు జోసినాడు
అప్పుడేమని పలికినాడు ఫ్రాంచిదొరగారు
కంబయిటో కంబయిటో విజయరామరాజు
కంబయిటోయని జెప్పినంత విజయరామరాజు
అట్టివేళలో జెప్పినాడు విజయరామరాజు
నాదుమనవి చిత్తగింపుము ఫ్రాంచిదొరగారు
డేరాచెంతవచ్చిన వారెవరయ్యా ఫ్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నాడు ఫ్రాంచిదొరగారు
బొబ్బిలివారి దివాణమంటా ధర్మారాయుండు
రాయభారమే వచ్చినాడు ధర్మారాయుడు
రాయభారమే వొప్పకపోతిని విజయరామరాజు
లేనిపోని మాటలుపల్కి బొబ్బిలికి పోలేడు
కోటకుపోతే యేమిచేయునో ధర్మారాయుడు
పేరుజెందిన ధర్మారాయుడు కోటకు పోతేను
అప్పుడేమని చెప్పినాడు విజయరామరాజు
సంధికొచ్చిన ధర్మారాయుడు కోటకు పోతేను
పన్నెండేండ్లు పోరుచేసిన కోటను తియ్యము
బొబ్బిలికోటకు భోరుసింహము ధర్మారాయుండు
మాటలవల్ల చంపుతున్నాడు ధర్మారాయుణ్ణి
సెలవివ్వండి సెలవివ్వండి ఫ్రాంచిదొరగారు
యీరీతిగా జెప్పినాడు విజయరామరాజు
అట్టివేళలో ఫ్రాంచివారు మరిబాగన్నారు
అక్కడనుంచి వచ్చినాడు విజయరామరాజు
డేరావిడిచి వచ్చినాడు విజయరామరాజు
రుమాలుగుడ్డ తలలోకట్టెను విజయరామరాజు
తండుకొమెన సుభేదారుని యప్పుడు పిలిచెను
నన్నుపిలిచిన కార్యమేమి విజయరామరాజా
పరాకులేక వినుము యిపుడు హాయిదరుజంగోజి
పోతున్నాడు పోతున్నాడు ధర్మారాయుడు
ఫ్రాంచివారి డేరాచెంతకు సంధికి వచ్చెను

రాయభారము వొప్పకపోయే ప్రాంచిదొరగారు
బూచిగారిని దూరితైన కోటకు పోతాడు
దండుకులోగా పోతున్నాడు ధర్మారాయుడు
మల్లించండి మల్లించండి ధర్మారాయుణ్ణి
మాటలచే పట్టిపెట్టుము ధర్మారాయుణ్ణి
పట్టికట్టి బంధించి నాచేటికి తెన్నండి
మాటలవల్ల చిక్కకపోతే ధర్మారాయుణ్ణి
నిమిషములోన చంపగవలెను ధర్మారాయుణ్ణి
పారాలమీదనే చంపగవలెను ధర్మారాయుణ్ణి
ఆమాటలు విన్నాడయ్యా హైదరుజంగోజి

వ. రాజుగారి మాటలువినిన హాయిదరుజంగు తన పారాచౌకీల నిలిచి ధర్మారాయుణ్ణి కోటకు పోనీక పట్టిబంధించి తెమ్మని వుత్తర వియ్యాగ వారువెళ్ళి ధర్మారాయుణ్ణి యుద్ధగించుచున్నారు.

ధర్మారాయుని కడ్డమైనారు పారాచౌకీలు
కన్నుసయిగ చేసినారుగా పారాచౌకీలు
గుంపువచ్చి కమ్మిందయ్యా హాయిదరుజంగోజి
మూడువేల ముకుండబల్యము పారకమ్మినారు
రెండువేల సోల్జర్లు పాశాకమ్మినారు
పోనీయము పోనీయము ధర్మారాయు
రాజుగారి వుత్తరవులేక బాటలు విడువము
ప్రాంచివారితో వాదులుచేసి కోటకు పోతావా
పారామధ్య చిక్కినాడు ధర్మయ్యగారు
అప్పుడేమని చెప్పినాడు ధర్మారాయుడు
అన్నలార తమ్ములార పారాచౌకీలు
రాయభారము వచ్చినాను ప్రాంచిచేటికి
రాయభారము కుదరలేదు పోతూవున్నాను
యుద్ధంబునకు రాలేదయ్యా పారాచౌకీలు
వారివారి బలములంతయు కోటలో చూతాము
ఇంతేగాక యికయేమిలేదు పారాచౌకీలు
పోనుత్రోవ విడువమయ్యా ధర్మయ్యాగారు
యీరీతిగా చెప్పినారు పారాచౌకీలూ
ఆ మాటలకు యేమంటారు ధర్మయ్యాగారు

కోటకుపోయి తిరిగివచ్చెదా పారాచౌకీలూ
ఆ మాటలకు యేమంటారు పారాచౌకీలూ
నిన్నుబట్టి గట్టిగమమ్ము తెమ్మనినారు
ఈవిధంబుగా చెప్పినారు హైదరుజంగోజి
అట్టిమాటలు విన్నాడు ధర్మారాయుడు
నన్నుబట్టి బంధించిరాజు చేటికి తెమ్మనెనా
నన్నుపట్టెడి మొగధీరులు దండులో యున్నార
నన్నుపట్టెడి సుభేదారులు దండులో యున్నార
దండులో యెక్కడ యున్నాడయ్యా హైదరుజంగోజి
కన్నుసైగ జూపించినాడు యప్పుడు యైతేను
యీరీతిగా చెప్పినాడు ధర్మారాయుడు
మాటలవలన చిక్కలేదు ధర్మారాయుడు
కన్నుసయిగ చేసినాడు హైదరుజంగోజి
కన్నుసయిగ చూచినారు పారాచౌకీలూ
యాబయిరెండు తుపాకులాడ పెలతాలుంచిరీ
తుపాకిరొక్క శబ్దము విన్నాడు ధర్మారాయుడు
వానివెంటనే వస్తున్నాది ఖారాతేజీదా
వుదానువేసి యెగిరినాడు తేజిమీదాను
ధర్మారాయునికి సరిగావారు టాయిగ చూచిరీ
ఫళఫళమని కాల్చినారు టుపాకు లంతా
గొబ్బునయపుడు త్రిప్పినాడు తేజిని యపుడుదా
నాలుగు ప్రక్కల త్రిప్పినాడు ఖారాతేజిని
యెగిరినాదిర యోజన పొడుగున తేజీయపుడుదా
భూమిమీదనే పారినాదిర ఖారాగుండ్లుదా
తొలిదెబ్బ తప్పించుకొన్నాడు ధర్మారాయుడు
రెండవతూరి వచ్చినారు పారాచౌకీలూ
ఫళఫళయని కాల్చినారు టుపాకు లంతాను
అప్పుడెటుల యున్నాడయ్యా ధర్మారాయుండు
నాలుగు ప్రక్కల త్రిప్పుతున్నాడు తేజినియపుడుదా
కాలుసయిగ చేసినాడు ఖారాతేజికి
కదలక మెదలక యున్నదయ్యా భూమికిపయిగాను
తగ్గించిదానిని నిలిపినాడు ధర్మారాయుండు

శిరసున వెళ్ళిపోయెను బారాగుండ్లుదా
మరుదెబ్బకు తప్పించుకొన్నాడు ధర్మారాయుడు
యికమనము జయించజాలము జయించజాలము
యీరీతిగా జెప్పినాడు పారాచౌకీలు
అప్పుడేమని జెప్పినాడు హాయిదరుజంగోజి
యలమలబిడ్డల శిరస్సుచూచి టుపాకిలంతాను
వంచివంచి నిలుపండయ్యా టుపాకిలంతాను
యీరీతిగా చెప్పినాడు హాయిదరుజంగోజి
యలమాబిడ్డల శిరస్సుజూచి టుపాకులంతాను
ఫళఫళయని కాల్చినారండి టుపాకులంతాను
ముగ్గురైన యెలమాదొరలు భూమిలో పడినారు
యలమలచావు కన్నులజూచెను ధర్మారాయుండు
యెన్నడులేని కోపముగలిగె ధర్మారాయుడికి
అన్నలార తమ్ములార యెలమాదొరలార
మీదుబలము యెక్కడపోయె యెలమాదొరలార
యీరీతిగా వ్యసనముతోను అప్పుడేమని పలికె
చిక్కనచక్కన రాణువులతోను అప్పుడేమని పలికె
అన్నలార తమ్ములార యెలమాదొరలారా
ముందువెనుక జూడవలదు దండుకు లోగాను
రాజవారి చెయ్యిప్పుడు మెండుగ జూపిరీ
మీదుబలములు చూపండయ్యా దండుకు లోగాను
పటాకత్తుల రెండుచేతుల భగ్గున పట్టెను
రామరామ అనంతకాలము రాజ్యమేలలేము
యెన్నిదినములు బ్రతికినగాని చావుయున్నాది
యిచ్చట చచ్చిన వారికిచాలా వీరస్వర్గము
ధయిర్యపు మాటలు చెప్పినారు ధర్మారాయుండు
దండుకులోగా దూకినారండి యుద్ధము చేయను
యీటికొయ్యలు యెత్తినారు యెల్మాదొరలుదా
వేటువేటు చంపినారు యేనుగులబారు
యేనుగుల తొండములు బట్టియపుడు ధర్మారాయుండు
పర్రనిచింపి భూమిమీదనే భగ్గున వేసెను
పటాకత్తికి పదిమందయినా కాయిగ పడుతారు

అప్పుడుతిన్నా పప్పుకూడన్నము కుప్పగ పడినాది
హరిరామ శ్రీరామాయంటు మెల్మాదొరలూదా
వారివెంబడి వస్తున్నారు మెల్మాదొరలూదా
చేతులుచేతులు పెనవేసి చేతులతో చంపిరీ
కాళ్లుకాళ్లు పెనవేసి కాళ్ళతో జంపిరీ
ఈరీతిగా వస్తున్నారు యలమాదొరలుదా
అప్పుడెట్ల వున్నాడండి ధర్మారాయుడు
ముందుగాను నఱికినాడు మున్నూటికైనా
వెనకతూరి నఱికినాడు యేనూటికైనా
చలోచలో అంటుయప్పుడు వస్తావున్నాడు
బొబ్బిలివారి దేవిడికాడ బాటలు కొట్టైను
అక్కడక్కడ పారాలన్ని వెనుకకు పోయింది
పారలన్ని హతము చేసెను ధర్మారాయుండు
కొండలడవుల పాలయ్యెను ప్రాంచిదండుదా
చిల్లివంటి రక్తముయాడ చిమ్మిపాఱింది
రాళ్ళచిప్పల పాలాయెను రాజులదండుదా
నెత్తురులోనే తుండు మొండెములు పైకితేలింది
ఘోరఘోరదున చేసెనండి దండుకు లోగాను
ముగ్గురైనా యెలమదొరలు చచ్చిన చోటునా
అయిదువేల యేమాటికిదండు హతము చేసెను
.కోటగవిని వస్తున్నారు ధర్మారాయుండు
కోటగవినికి వచ్చియపుడు గోవిందం పెట్టైను
ఏబదిముగ్గురు యెలమాదొరల యెంచుకున్నాడు
ముగ్గురైనా యెలమాదొరలు తక్కువైనారు
తనలోతాను చింతించెను ధర్మారాయుడు
కొదువపెట్టుకొని కోటకుమనము యెట్లుపొయ్యేది
బావగారు రంగయ్యతో యేమని చెప్పేది
వారియొక్క తలిదండ్రులకు యేమని చెప్పేది
పలువిధముల చింతించెను ధర్మారాయుండు
ఈరీతిగా యోచించెను ధర్మారాయుండు
అజారమునకు వస్తున్నాడు ధర్మారాయుండు
వ. తన్నెదిరించిన శత్రువులను తుపాకి గుండులను లాఘవముగ

తప్పించుకొని వచ్చుచుండగా, శత్రువుల గుండులకు మువ్వురు యల్మాబిడ్డలు బలికాగా మిక్కిలి కోపముజెంది ఐదువేల యేనూటికిపైగా శత్రుసైన్యములను చించిచెండాడి దారిచేసుకొని మిగిలిన యేబదిమంది యల్మాదొరలను వెంటబెట్టుకొని బాజారమునకు తిరిగివచ్చి రంగారాయుని సంధి విఫలమగుటను అతనికి నివేదించుచున్నాడు.

వెనుకచిక్కి వస్తున్నారు రంగయ్యదొరగారు
పరాకుంచక వినుము యిపుడు ధర్మారాయుడా
పోయిన కార్యము యేమాయెను ధర్మారాయుడా
కాయాయెనా పండాయెనా ధర్మారాయుడా
కాయిగనిలిచి అపుడే కలహము వచ్చేను
రాజుమాటలు ఫ్రాంచిమాటలు వకటైయున్నాది
రాయభారము కుదరకపోయి వస్తావుంటిని
పారామీద పోటుమాటలు గట్టిగు జరిగేను
మువ్వురైనా యెలమబిడ్డలను గోరిపెట్టినారు
యల్మాబిడ్డల గోరిపెట్టిన చోటున యపుడుదా
అయిదువేల యేనూటికిదండు చాపుగ చంపితిని
కోటలోయుండే పోలేరమ్మకు జాత్రలు చేయిస్తి
యీరీతిగా చెప్పినాడు ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
పాపారాయుడు సంధికిపోతే అక్కడనైతేను
కానిపోని మాటలవలన కలహము వస్తేను
ఫ్రాంచివారి శిరస్సుగోసి కోటకు గట్టును
రాజుగారి శిరస్సు కోటకు గట్టును
కొలువున యుండతగదు యిపుడు ధర్మారాయుడా
రాజకాంతల మేడలకైనా పొమ్మని చెప్పేను
పదిమందిలో చిన్నబుచ్చెను వెంగళరాయుండు
అంతలోపల యేమన్నాడు ధర్మారాయుండు
బావగారి వుత్తరవులేదు బావగారుదొరలూ
బావగారి వుత్తరవునాకు కొంచము యుంటేను
డేరాలోగా చంపివాని కొలువుకు వస్తాను
సెలవులేకా బేటికివస్తిని వెంగళరాయుడా
మంచిదన్నాడు బాగన్నాడు ధర్మారాయుండు

అప్పచెల్లెలయిన మల్లమ్మదేవి మేడకొచ్చినాదు
అప్పుడు యేలాగున్నదయ్యా మల్లమ్మదేవిదా
బాణాపందెము బెట్టియపుడు పగడసా లాడుతున్నది
అన్నతమ్ముని కన్నులచూచెను మల్లమ్మదేవిదా
అప్పుడేమని జెప్పినాదిర మల్లమ్మదేవిదా
పరాకుంచక వినుమయిపుడు ధర్మారాయుడా
యెప్పుడురాని అన్నగారు యెందుకు వచ్చితిరీ
మీరువచ్చిన కార్యమేమి తెలియ జెప్పండి
యేమి అపాయం జెందెనయ్యా బొబ్బిలికోటలో
అంగీలంతా రక్తముయేమి ధర్మారాయుడా
యీరీతిగా యడిగినాది మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాడు ధర్మారాయుండు
పరాకుంచక వినవేతల్లి మల్లమ్మదేవిదా
కర్మచండాలుడు కులద్రోహి విజయరామరాజు
కోటకిపుడు తండుతెచ్చెను విజయరామరాజు
భూముతెరుంగని ఫ్రాంచివారు భూములకొచ్చిరీ
యధికదళములతో వచ్చియపుడు కోటకమ్మినారు
యెటుప్రక్క చూచినగాని యేడసందూ లేదూ
రాయభారమునసే పంపినారు రంగయ్యదొరగారు
రాయభారము పోతినమ్మా దండుకు లోగాను
ఫ్రాంచివారి డేరాచెంతకు సంధికి బోతిని
రాయబారము కుదరకపోయి వస్తావుంటిని
పారామీద గట్టిమాట గట్టిగా జరిగెను
ముగ్గురయిన యెల్మాదొరగా గోడపెట్టినారు
ముగ్గురయినా యెల్మాదొరలూ చచ్చిన చోటున
అయిదువేల యేనాటిదండు హతమైపోయింది
బావగారి సభకునేను తాయిగ వచ్చితిని
సంగతులన్ని చెప్పితినమ్మా బావగారితోను
నిండుకొలువున చిన్నబుచ్చెను రంగయ్యదొరగారు
కొలువునయుండ తగదనిపలికే వెంగళరాయుండు
వారకాంతల మేడకిప్పుడే పొమ్మని చెప్పేను
యీరీతిగా చెప్పినారయ్యా ధర్మారాయుండు

ఇన్నిమాటలు విన్నాడయ్యా మల్లమ్మదేవిదా
తమ్ముడికయినా ధయిర్యపుమాటలు తానుజెప్పినాది
రక్తమయినా అంగీలంతా తీసివేసినాది
స్నానమపుడు చేయించినాది ధర్మారాయుణ్ని
చలవ వస్త్రములు గట్టించెను ధర్మారాయుడికి
ఆనిమిటి సభకు పంపెను మటల దేవిగారుదా
అప్పుడెటుల వున్నడయ్యా రంగయ్యదొరగారు
నిండుకొలువులో వున్నాడు రంగయ్యదొరగారు
అన్నతమ్ములు బావమరదులు కొలువుతీరినారు
ముందుజరిగిన కారణములన్ని యోచిస్తున్నారు
యిక్కడిరొక్క సంగతులయితే యిట్లువున్నాది
అపుడెటుల యున్నాడండి మల్లమ్మదేవిదా

వ. ధర్మారాయుడువచ్చి మల్లమ్మదేవిగారితో తాను పోయి వచ్చిన సమాచారములన్ని జెప్పగా, వెంటనే దేవిగారు అతను కట్టి యుండు వస్త్రములను విప్పి స్నానంచేయించి మరల మల్లమ్మదేవిగారు తన నాథుని కొలువుకు పంపించి తాను విజయరామరాజుగారికి తన రొక్క మాంగల్యము నిల్పుమని జాబువ్రాస్తున్నది.

విజయరామరాజుగారికి వ్రాసెను జాబుదా
వందనమయ్యా వందనమయ్యా విజయరామరాజు
పూసలపాటి వారియిల్లు పుట్టిల్లునుకొంటి
దామర్లవారి సమస్థానం మఱచి పోయినాను
అన్నయనిదా నమ్మినాను విజయరామరాజా
విజయనగరము బొబ్బిలికోట కావడికుండలు
కావడికుండలు తప్పించవలదు కన్నతండ్రినీవు
నల్లగాజు నల్లపూస నాకు నిల్పండి
బొట్టుకాటుక నిలుపుమయ్యా విజయరామరాజు
పసుపుకుంకము నిలుపుమయ్యా విజయరామరాజు
యీతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటను
ఈమాదిరి జాబులువ్రాసే దేవిగారుదా
మున్నాటిలో పెద్దదాది వెంకటలక్ష్మమ్మా
వెంకటలక్ష్మిని యపుడు పిలిచెను దేవిగారుదా
పసుగ్త్రివచ్చాను వెంకటలక్ష్మి దాదీదా

వందనమమ్మా వందనమమ్మా దేవిగారుదా
నన్ను పిలిచిన కార్యమేమి దేవిగారుదా
అప్పుడేమని జెప్పినాది దేవిగారుదా
పరాకుంచక వినవేతల్లి వెంకటలకిమి
తొల్లిపగలు మనపై యుంచెను విజయరామరాజు
దేశమెరుగని ఫ్రాంచివారిని తెచ్చియిచ్చుటను
యిరువైనాల్గువేల దళముతో ఫ్రాంచివచ్చినాడు
యధికదళములు వచ్చియిపుడు కోటకమ్మినాడు
గొల్లపల్లికోనేటిలో రాజుదేరాదా
జాబుయెత్తుకొని రాజుముందు తాయిగ పొన్నండి
రాజుకొలువున జాబునుపెట్టి వందన మొసగుము
యీరీతిగా జెప్పినాది దేవిగారుదా
జాబుకమ్మను చేతయిచ్చె దేవిగారయితే

వ. దేవిగారు యీ విధముగా జాబువ్రాసి వెంకటలకిమి యను దాదిచేత చాపకన్ను దరవాజాతావున రాజుగారి డేరా యున్నది నీవు ఈ కాగితమును పుచ్చుకొని రాజుగారి తావున యిచ్చి మఱల జావాబు తెమ్మని పంపెను.

చాపకన్ను దరవాజాకు నడవసాగినాది
రాజుగారి డండులోపల పోతూవున్నాది
రాజుగారి కొలువునవుంచి వందన మొసగేను
యెవ్వరితాలూ కన్నాడయ్యా విజయరామరాజు
దేవిగారి తాలూకాయని బదులు జెప్పినాది
దేవిగారి జాబునేను తెచ్చితినయ్యా
తెచ్చినజాబు కొలువునపెట్టెను వెంకలకిమి
జాబును యపుడు చేతమెత్తెను విజయరామరాజు
జాబులోని సంగతులన్ని కన్నుల చూచేను
పరాకుంచక వినుముయిపుడు విజయరామరాజు
అన్నయనిదా నమ్మినాను విజయరామరాజు
పూసలపాటి వారియిల్లు పుట్టిల్లనుకొంటి
దామర్లవారి యిల్లునేను మఱచి పోయినాను
విజయనగరము కావడికుండలు మఱచిపోయినాను
కావడికుండలు తప్పించవలదు కన్నతండ్రినీవు

యీతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాను
మంచిమంచి చీరెలునేను మావదనె కంపుతాను
నల్లపూస నల్లగాజు నాకు నిలపండి
బొట్టుకాటుక నిలుపుమయ్యా విజయరామరాజు
పసుపు కుంకము నిలుపుమయ్యా విజయరామరాజు
యీతూరి మన్నించుమయ్యా బొబ్బిలి కోటాను
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
పరాకుంచక వినవేతల్లి దేవిగారుదా
నల్లపూసలు నల్లగాజులు నిల్పను తరమౌనా
బొట్టుకాటుక నిల్పను నాదు తరముగాదుతల్లి
ముండమోసితే మూడుపల్లెలే యినాము లిచ్చెదను
ముండకోక ముందుగయేతు దేవిగారికిదా
ముందుకూడు ముందుయన్నము నీదేయన్నాడు
విజయనగరము నుండినేను జాబులు వ్రాసితిని
జాబుతెచ్చిన హర్కారులను చంపలు కొట్టించి
మెడనుబట్టి త్రోయించెను వెంగళరాయుండు
ఆడవారి జాబులుయపుడు కొలువుకురారాదు
చదివిట్టి జాబులక్కడ చించివేసినాడు
జాబుతెచ్చిన వెంకటలక్ష్మిని చెంపలు కొట్టెను
మెడబట్టి త్రోయించినాడు రాజుగారయితేను
గోడుగోడునా దుఃఖించినాది వెంకటలక్ష్మి
దేవిగారి కొలువుకువచ్చెను వెంకటలక్ష్మి
యింతలోపల యేమన్నాది మల్లమ్మదేవియు
పోయినట్టి పనియేమాయెను వెంకటలక్ష్మి
మీరుయిచ్చిన జాబులక్కడ సభలోపెట్టితిని
జాబునుయిప్పుడె చదువుకొన్నారు విజయరామరాజు
ముండమోసితే మూడుపల్లెలు యినాము లిచ్చెదరు
యీతూరి మన్నించ సాధ్యము కాదంటా
మిమ్ములను అధిక మాటలచే తిట్టినాడుతల్లి
చదివినట్టి జాబులక్కడ చించివేసినాడు
చెంపలపయినా కొట్టినాడు దేవిగారుదా
మెడనుబట్టి తోచినాడు దేవిగారుదా

యీరీతిగా జెప్పినాది వెంకటలక్షిమి
యిక్కడి కథలూ యీలాగున్నది కోటకులోగాను
అప్పుడటుల యున్నదయ్యా వెంగళ్రాయుండు
అన్నగారు రంగయ్యదొర యెరుక లేకుండా
వదినగారు దేవిగారి యెరుక లేకుండా
బావమరదికి జాబులు యప్పుడే వ్రాసియిచ్చాడు
కాగితంబును పేనాయపుడు చేతనెత్తెను
రాజాధి రాజపూరిత పాపారాయుడా
నీదయ యుంచుమయ్యా పాపారాయుడా
నీకటాక్షము చాలాయుంచుము పాపారాయుడా
కోటమీదనే దండు తెచ్చెను విజయరామరాజు
యధిక దళములు వచ్చియిపుడు కోటకమ్మినారు
మంచినీళ్ళ బావిచెంత లక్షుమయ్యదేర
పాతబొబ్బిలి పాటిమీదనే వ్రాంచిడేరాదా
గొల్లపల్లి కోనేటిలో రాజుడేరాదా
యీరీతిగా యున్నారయ్యా కోటలు చుట్టును
రాజునుకొట్టి రేవులవద్ద మీరేరన్నండి
వ్రాంచినిగొట్టి రేవులవద్ద మీరే రన్నండి
ఈరీతిగా వ్రాసెను జాబుకు లోగాను
లకోట చేసినాడు జాబును యపుడూదా
యిరువురినయిన బేరరావుల తాను పిలిచినాడు
స్త్రీలవేషము వేసినాడు బేగిరావులకు
కురులు కున్నగా దువ్వించి కొప్పుబెట్టినాడు
చీర రవికెలూ కట్టించెను బేగిరావులకు
గాజులపుడు తొడిగినాడు బేగిరావులకు
గంపనిండుగా తోటకూర కోసివేసినాడు
గోదుమపిండి పాకము బాగా చేయించినాడు
రొట్టెయపుడు గాల్చినాడు వెంగళరాయుడు
రొట్టెలోనే పెట్టినాడు జాబును యపుడుగా
తోటకూరనడుమ రొట్టెను పెట్టినాడు బాగా
అప్పుడేమని పలికినాడు వెంగళరాయుండు
జేరాదేవా చెంతనుమీరు కూరలు అమ్మండి

వెలలు అధికము చెప్పిమీరు కూరలు అమ్మండి

వ. ఆ వెంకటలక్ష్మి మెత్తుకొని వచ్చిన జాబును రాజుచూచి ముండమోసితే మాడుపల్లెలు యినాము యిస్తానని జెప్పి దాదిని చెంపలుగొట్టి పంపివేసెను. దానిని వెంకటలక్ష్మి దేవితోవచ్చి జెప్పెను. దేవితాపున శువిధముగనుండ వెంగళరాయుడు పాపారాయునికి జాబువ్రాసి బేగిరావులకు స్త్రీ[illegible]ముచేసి జాబులు రొట్టెలో పెట్టి పంపుతున్నాడు. అదిమెత్తుకొని వస్తున్నారు బేగిరావులు.

పారాలోపల బడిపోన్నండి బేగిరావులు
బాజారములో టాణావున్నాడు పాపారాయుడు
రాజువారు వచ్చెదరని బాట కాచియున్నాడు
బాజారముకు పోయివున్నాడు పాపారాయుడు
రాజుయాదారి వచ్చెదరని బాట కాచియున్నాడు
పాపారాయుని చెంతకుయిపుడు మీరేపోన్నండి
రొట్టెలయందు జాబుకమ్మను కొలువున వుంచండి
యిచ్చట నడిచిన సంగతులన్ని రాయిగ జెప్పండి
యీరీతిగా జెప్పినాడు వెంగళరాయుడు
చాపకన్న దరవాజగుండా యప్పుడె పోయిరీ
యచ్చటనుండి వస్తున్నారు బేగిరావులు
దేశాచెంతకు రాగానే బేగిరావులు
కూరకూరకూర యంటు కూతలువేసిరీ
వెలపాడుగు ధరలుజెప్పుతు కూరమ్మినారు
ప్రాంచివారి దండుకులోగ కూరలమ్మినారు
కొండప్రక్క వచ్చినారు బేగిరావులు
కత్తులపార కలాసుపార తిరుగుతు యున్నారు
దొంగజేరు పారాలన్ని తిరుగుతు యున్నారు
పారాచెంత డాకీలయిరి బేగిరావులు
యప్పుడేమని అడుగుతారయ్యా పారాచౌకీలు
యేవూరు యేపల్లెవారు మీరు తెలియజెప్పండి
కొండప్రక్క గొల్లపల్లెలో మేము యుండేది
గంపలోయేమే గంపలోయేమే మమ్ముగన్నతల్లి
పరాకుంచక వినుమువిపుడు పారాచౌకీలు
తోటకూర యమ్ముతు మేము వస్తాయున్నాము

కొంతకూర మాకుపెట్టుమా మమ్ము గన్నతల్లి
యిట్లుచెప్పుతు గంపయపుడు దిగువ దించినారు
క్రిందుమీదుగ చేసినారయ్యా తోటకూరను
కూరయందు రొట్టెలు యపుడు చేతికి తగిలెను
అప్పుడేమని పలికినారు పారాచౌకీలూ
రొట్టెలెందుకే మీకు యిపుడు మమ్ముగన్నతల్లి
ఆకలికొంటె రొట్టెలూతిని దాహము చేతుము
యీరీతిగా జెప్పినారు బేగీరావులూ
అట్టిమాటలకు యేమన్నారు పారాచౌకీలు
మాయొక్క ఆడవారు రొట్టెలు కాలిస్తే
యింత సుఖముగా యుండదే మమ్ముగన్నతల్లి
యిట్లుజెప్పుతు రొట్టెలువారు నడుమున తుంచిరీ
రొట్టెలోయుండు మర్మపుజాబు బయట పడినాది
రొమ్మురొమ్ము గుద్దుకొన్నారు పారాచౌకీలు
యిరువుర బేగీరావులబట్టి ఖయిదులో యుంచిరీ
రాజుగారి డేరాకావుకు తీసుకవచ్చిరి
ఖైదిచేసి తీసుకవచ్చిరి బేగీరావుల
రాజుగారి కొలువునవచ్చి వందన మొసగిరి
పరాకుంచక వినుము యిపుడు విజయరామరాజు
బొబ్బిలివారి మచ్చిలిజాబు మేము తెచ్చినాము
జాబును యపుడు చేతికిచ్చెను పారాచౌకీలు

వ. పారాచౌకీలు తనచేతికిచ్చిన జాబును చదువుకొన్న రాజు పాపారాయుడు కొలువులో లేకుండుటను గ్రహించినవాడయి ఫ్రాంచి వెంటకుపోయి బొబ్బిలికోటలో జొరబడుటకు ఇదేసమయమని ఫ్రాంచికి రాజుగారు తెలుపుచున్నాడు.

ఫ్రాంచివారి డేరా వెంటకు కదలి వచ్చెను
సలామయ్యా సలామయ్యా ఫ్రాంచిదొరగారు
యీలాగునా జెప్పినాడు విజయరామరాజు
కోటలకంత భోరుసింహము కోటలో లేడండి
రెండులక్షల వరహాలపుడు సదరు మొత్తుకొని
యిద్దరువొక్క కుర్చీమీద కొలువు తీరినారు
అప్పుడేమని పలికినాడు విజయరామరాజు

బొబ్బిలివారి దొంగజాబులే బయట పడినాది
తెచ్చినట్టి దొంగజాబులే చేతికిచ్చినాడు
జాబును చేత తీసుకొన్నాడు ఫ్రాంచిదొరగారు
జాబులోయుండు సంగతులన్ని కన్నుల జూచేను
అప్పుడేమని పలికినాడు ఫ్రాంచిదొరగారు
పాపారాయుడు యెవడన్నాడు ఫ్రాంచిదొరగారు
చిన్నమనవి చిత్తగింపుము ఫ్రాంచిదొరగారు
బొబ్బిలి యందుండువారి పేర్లజెప్పుతాను
రంగారాయుడు వెంగళరాయు డిద్దరన్నదమ్ములు
రంగారాయుని బావమరిది ధర్మారాయుండు
వెంగళరాయుని బావమరిది పాపారాయుండు
పేరుపొందిన సరదారిబిడ్డ పాపారాయుండు
పులిలేదయ్యా పులిలేదయ్యా బొబ్బిలి కోటలో
పాపారాయుడు యుద్ధరంగుడు పటాలరాముడు
నూటికి యొకడె సరదారి వున్నారు కోటకు లోగాను
కోటలకంతయు ఘోరసింహము పాపారాయుండు
యిదిసమయము యిదివేళ బొబ్బిలి మీదికి
అటువంటి మాటలకు యేమన్నారు ఫ్రాంచిదొరగారు
యెవరికి మొనగాడండి పాపారాయుండు
పాపారాయుడని నీవు ప్రసిద్ధిగ జెప్పెదవు
యీరీతిగా పలికినాడు ఫ్రాంచిదొరగారు
అటులజెప్పవద్దు అటులజెప్పవద్దు ఫ్రాంచిదొరగారు
పాపారాయుడని పేరుజెప్పితేనుగా
పసిబిడ్డ లందరు పాలుత్రాగలేరు
బొబ్బిలికోటకు వస్తాడయ్యా పాపారాయుండు
తాండ్రవారి పాపారాయుడు కోటలో యుంటేను
యింతసేపు నిల్వనిచ్చునా కోటల క్రిందాను
నల్లయేరు దాటనివ్వడు పాపారాయుండు
యిక యేమిచెప్పాను యేమిజెప్పాదు ఫ్రాంచిదొరగారు
యిటువంటి దొంగజాబులు యెన్నిపోయినదో
యిక్కడియొక్క సంగతులు తెలిసి యుంటేను
రాత్రిరాత్రి వచ్చునయ్యా పాపారాయుండు

పడకలోను కుమ్మినాడు కోటకు పోతాడు
నమ్మవలదు నమ్మవలదు బొబ్బిలి వారిని
కాలహారణము చేయవలదు ప్రాంచిదొరగారు
మూడవజామున తియ్యవలెను బొబ్బిలి కోటాను
రాత్రిపూటనే బొబ్బిలికోటను పట్టవలేనండి
తెల్లవారగా దేవిడిముందు ప్రాంచిదొరగారు
పన్నెండు లక్షల పయికమయితె గొబ్బున యిచ్చేను
యెదురుగా నిలబెట్టెను విజయరామరాజు
ఫిరంగి కాల్పించెను విజయరామరాజు
తలుపు తెఱచిన చందమాయెను బొబ్బిలి కోటవా
యీరీతిగా పలికినాడు విజయరామరాజు
దొంగజాబు తెచ్చినట్టి బేగిరావులను
దొంగజాబులు తెచ్చినవారిని షుమిబేసినాడు
తొలిదెబ్బకు తునిగి పడినారు బేగిరావులూ
ఈ సంగతులే తెలియకపోయె వెంగళరాయుడికి
రాజుమాటలే విన్నాడు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలములంత తెలియక యున్నారు
తానువొక్క పరమానైన వ్రాసియిచ్చేను
అప్పుడటుల యున్నాడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి మన్నెంమీదికి కదలి వచ్చినాడు
ఇన్నూట ఆవుతరుపులే కొల్ల పెట్టినారు
మున్నూట పందిపిల్లల కొల్ల పెట్టినాడు
ఆవులగొంతు కోసినాడు ప్రాంచిదొరగారు
పందులగొంతు కోసినాడు ప్రాంచిదొరగారు
పచ్చినెత్తురు భరంతసారాయి పాకము చేయించి
దండుకుమొన సుబేదారుని పిలిపించినాడు
దండుకుమొన సుబేదారు హాయిదరుజంగోజి
హాయిదరుజంగోజి కొలువుకువచ్చి సలాముచేసెను
మనిషికియొక్క మూడుగిన్నెలా లాగిరియిచ్చేను
లాగిరితాగిన మూడునిమిషములకు కైపుయెక్కేను
కోటమీదుగా నడిచినారు జాతులవారుదా
మందుపెట్టెలు పగలగొట్టి మందులా పఱచిరీ

మందుపెట్టెను తిత్తుకుండలు బండ్లవేసిరి
పెద్దభీరంగి గుండ్లంతయు బండ్లలోవేసిరి
ఈరీతిగా ప్రయాణమైనారు అనిమిషములోనా
యచటనుండియు వస్తున్నారు జాతులవారుదా
కోటకు దిగువ వచ్చినారు జాతులవారుదా
మద్దిమానులు కొట్టించినారు జాతులవారుదా
అడ్డత్రోవగా నడిచినారు భీరంగి గుండులుదా
తట్టుకోట క్రిందకువచ్చి మకాము చేసిరి
పెద్దభీరంగి బండ్లంతయు మోహార్జా లెత్తిరీ
రామలక్ష్మణ భీరంగులే మోహార్జా లెత్తిరీ
పరికత్తులకే సెలవిచ్చినారు ప్రాంచిదొరగారు
ఫళఫళయని కాల్చినారు భీరంగ లంతయు
తొలిదెబ్బకు బొబ్బిలికోటమైన బద్దలాయెగా
గడ్డగడ్డగా పడిందయ్యా భూమికి పయిగాను
తట్టుకోటలో యున్నాడు పటాలరాముడు
యెక్కివచ్చి ప్రాంచివారిని కన్నుల చూచేను

వ. తట్టుకోటకు కావలియున్న పటాలరాముడు తమ కోటను ముట్టడించియున్న ప్రాంచిదండును కన్నుల చూచి ఈ సంగతి రంగా రాయునికి చెప్పబోతే కామస మాతుందని తనతోడయున్న యాబయి మువ్వురు యల్మాదొరలను వెంటతీసుకొని పోయి శత్రువులతో ఘోరముగా పోరాడుచున్నాడు.

యాబై ముగ్గురు యల్మాదొరలు వెంటనే యున్నారు
అన్నలార తమ్ములార మాయన్నలార
రంగయ్యతో చెప్పనుబోతే కాలమాతుంది
చచ్చినాను బ్రతికినాను పేరేయుంటుంది
ముందువెనుక చూడరాదు దండుకు లోగాను
బారాతేజి యెక్కినపుడు పటాలరాముడు
కన్నుసయిగ చేసినాడు పటాలరాముడు
యీటెమీదుగా సాము చేసిరి యెల్మాదొరలుదా
యెక్కివచ్చె ప్రాంచివారిని సాపుగ జంపిరీ
కోటవెలుపల దుమికినాడు పటాలరాముడు
డేగలాగు దూరినాడు పటాలరాముడు

వంచివంచి యీటెలతోను వాదులాడిరీ
చేతులతోను పట్టియపుడు బాగుగా కుమ్మిరీ
మెడలువంచి వీపులమీద బాకున కుమ్మిరీ
వత్తులపెట్టె జాతులవారిని గొంతులు కోసిరీ
కాళ్లుత్రొక్కి గొంతులుకోసిరి ప్రాంచివారిని
గుఱ్ఱముచుట్టు గుంపులుగానే పోరుచేసినారు
అక్కడక్కడ పారాలన్ని వెనుక పోయినారు
దండుకుమొన సుబేదారుగా హాయికరుజంగోజి
జయించజాలక ప్రాంచివారి ముందుకు వచ్చేను
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
అప్పుడేమని పలికినాడు ప్రాంచిదొరగారు
యిపుడు జరిగే యుద్ధరంగము యెవరిదన్నాడు
పటాలరాముని యుద్ధమిపుడు జరుగుతున్నాది
పటాలరాముని మనమే యిపుడు జయించజాలము
మూడుపుట్ల నల్లమందుకే సెలవులు యివ్వండి
భూమిమీద పఱచినారు జాతులవారుదా
రవ్వగుండులు పఱచినారు మందుకు లోగాను
నాలుగుప్రక్కల మందుత్రాళ్లు తగిలించినారు
నిప్పులుపెట్టు జాతులవారు వెంటనే యున్నారు
మున్నాట కవాతుగుఱ్ఱములు ముందుగ యున్నది
రామరామ కామాయంటు వస్తావున్నారు
గుఱ్ఱమనిగా దూకినారు యెల్కాదొరలుదా
నాలుగుప్రక్కల త్రిప్పినారు కవాతు గుఱ్ఱములా
తెలియకవచ్చి నల్లమందులో గప్పున దూకిరీ
నాలుగుప్రక్కల నిప్పులత్రాళ్ళు తగిలించినారు
ముందువెలుపట దూకినాడు పటాలరాముడు
మిలమిలయని మాడినారు యులమాదొరలుదా
పటాలరాముని బారాతేజి మందున కూలింది
ఒక్కడయి నిలిచినాడు పటాలరాముండు
నిప్పుపెట్టిన జాతులవారిని గొంతులు గోసేను
కాళ్ళతోత్రొక్కి గొంతులుకోసె ప్రాంచివారిని
వేటువేటునా నఱికినాడు యేనుగుల గుంపును

తటుకుతటుకున నఱికినాడు గుఱ్ఱముల గుంపును
కొల్లకల్లోలముగ నఱికినాడు గుఱ్ఱముల గుంపును
ప్రక్కబాజిలో యున్నారండి హాయిదరుజంగోజి
కన్నుసయిగ చేసినాడు పారావారలకూ
యీబయిరెండు తుపాకులాడ టప్పున కాల్చిరి
చుక్కలాగు టుపాకిదెబ్బ నొష్టను తగిలింది
రొమ్మునతగిలిన గాయములన్ని యెంచతరమానా
డొక్కలో తగిలిన గుండులు వీపున వెళ్ళింది
నెత్తురు వెల్లువలుగ పారుతుంది గాయములగుండను
పేగులు కండలు జారాడెను పటాలరామునికి
వ్రేలాడు పేగులబట్టి దట్టిలో గట్టెను
మల్లెమొగ్గల వంటిబల్యము తాను తీసుకొని
తఱిమితఱిమి పొడిచినాడు తొంబయి మందిని
నిలువజాలక పోయెనపుడు పటాలరాముండు
యింతబ్రతుకు బ్రతికినేను వీరిచేతిలో
వీరిచేతిలో చావడానికి జాతక మున్నదా
యీరీతిగా యోచించెను పటాలరాముండు
మందివేసి కొలువుతీరెను పటాలరాముండు
నడుమునయున్న పచ్చలబాకు జర్రునదీసెను
బాకుతీసి రొమ్మునవేసి భూమిన పడినాడు
కుట్టుకుట్టు ప్రాణముతోను కాడేయున్నాడు
పటాలరాముడు చచ్చినాడని ఢంకాకొట్టిరీ
వెనుకపోయినా దండుయపుడు తిరుగా వచ్చెను
ప్రాణముతోను పటాలరాముని గొంతుగోసిరి
తట్టుకోటలో జండాకొయ్యా యెత్తించినారు
తట్టుకోట పట్టుకొన్నారు ప్రాంచివారూడా
పుట్టుకోట క్రిందవచ్చి ముకాము చేసిరి
యీబయిరెండు రేఖలాలుగా మోహర్జాలెత్తిరి
గుండుమందు వేసియపుడు గట్టనచేసిరీ
ఫళఫళయని కాల్చినారు టుపాకు లంతాను
లక్కతోను గట్టియున్నది పుట్టుకోటయాను
ధాంధాంమని భీరంగులు వారు కాల్చినారు

గుండుదెబ్బకు బెత్తుడుకమ్మి సాగుతు వున్నాది
సాధ్యానికి రాకయున్నది పుట్టుకోటయున్న
సీమపొదులు తెప్పించినారు ఫ్రాంచిదొరలుదా
కోటపయిగా తగిలించినారు జాతులవారుదా
వుడుముతోక పట్టుకొని లగ్గల కెక్కిరీ

వ. పుట్టుకోటలోనున్న భేరీరామకక్క చుట్టు ముట్టిన ఫ్రాంచి దండునుజూచి యిక ఈ సంగతి రంగారాయుడికి తెలిపితే సేపవుతుం దని తమ పురుషులంతా వ్యాపారము చేయుటకు పోయినందున తన తోటి స్త్రీలను వెంటనిడుకొనిపోయి శత్రువులతో పోరాడి తెలియక వచ్చి నల్లమందులోబడి మూడుచునున్నారు.

యెక్కివచ్చే దండునపుడు కన్నుల చూచేను
పుట్టుకోటలో యున్నాదయ్యా భేరీరామక్కా
మున్నారు భేరీస్త్రీలు కోటలో యున్నారు
అందరికన్నా పెద్దదాది భేరీరామక్కా
అలంగాలకే యెక్కినాది భేరీరామక్కా
కోటలక్రిందా జూచినాది భేరీరామక్కా
అక్కడనుంచి వచ్చినాది భేరిరామక్కా
రాజదివాణము వచ్చినాది భేరీరామక్కా
స్త్రీలనందరిని పిలిచినాది భేరీరామక్కా
యమ్మలార చెల్లెలార అమ్మలార రండు
పుట్టుకోట కమ్మినారు ఫ్రాంచిదొరగారు
రామరామా యనంతకాలము రాజ్యమేలుతామా
జగముయుండు వరకుమనము యుండపోతామా
ధయిర్యపు మాటలు పలికినాది భేరీరామక్కా
యెన్నిదినములు బ్రతికినగాని చావే స్థిరమాను
వారివారి దివాణమునకే కదలి వచ్చినారు
వారివారి పురుషులంత బేరములకుపోయినారు
ఓడబేరము చేయను వారు పోయియున్నారు
తక్కెడగుండులు ఫలాలగుండులు వీపున గట్టిరీ
మనిషిమనిషికి వక్కలాకులు చేతను బట్టిరీ
ముసలివారిని బట్టియపుడు గొంతులు కోసిరీ
యవాయవా బాలలజట్టి గొంతులు కోసిరీ

పాలుత్రాగే బాలలనంత పీపునగట్టిరీ
అలంకారము యెక్కినారు ఫేరీస్త్రీలుదా
యెక్కివచ్చే ఫ్రాంచిదండును కన్నుల జూచిరి
పడకాళ్ళలో రాళ్లుచెక్కిరి ఫేరీస్త్రీలంతా
వడిగాయపుడు రువ్వినారు రాళ్లు అయితేను
వడిశాలక్రింద మూడువేలు మరణమయినారు
రవిడిబండంలు దొరలించినారు ఫేరీస్త్రీలుదా
యెద్దులకపుడు తాగుతున్నాది అంబటి బానలు
పల్పులువేసి బట్టినారు అంబటి బానాలు
బానాలంతయు దొల్లించినారు రాణువుల పైగాను
బానలక్రింద రెండువేలకు మరణము జెందిరి
నాగిలమాను తీసినారు ఫేరీస్త్రీలుదా
గిరగిరమని త్రిప్పినారు నాగిల మానును
దండుమీదికే నాగిలమానులు తాయిగ విడిచిరి
మానులక్రింద మూడువేలు మరణము జెందిరి
బురుజులక్రింద చేరనివ్వరు ఫేరీస్త్రీలుదా
సింహములాగున విడబడినారు ఫేరీస్త్రీలుదా
యేనుగులయొక్క తొండముబట్టి వెనుక పెట్టినారు
అక్కడక్కడ పారాలన్ని వెనుక వెళ్ళింది
పట్టాకత్తులతో సాముచేసిరి ఫేరీస్త్రీలుదా
చక్రములాగు తిరిగినారు ఫేరీస్త్రీలుదా
వేటువేటునా నటికినారు యేనుగుల గుంపును
కోటలక్రింద పారాలన్ని సాపుగ జంపిరి
అప్పుడటుల యున్నాడయ్యా హాయిదరుజంగోజి
ఫ్రాంచివారి బేటికివచ్చి సలాము చేసెను
యిపుడు జరిగే జగడము యెవరిదన్నాడు
ఫేరీస్త్రీల జగడమిపుడు జరుగుతు యున్నాది
బురుజులక్రింద చేరనివ్వరు ఫేరీస్త్రీలుదా
గెలువలేము గెలువలేము ఫేరీస్త్రీలను
మూడుపుట్ల నల్లమందుకే సెలవు లీయుము
యీమాటలు వినినాడు ఫ్రాంచిదొరగారు
టోపీదీసి దిగువగొట్టె ఫ్రాంచిదొరగారు

చేతిగ్రేలు కొఱికినాడు ప్రాంచిదొరగారు
మూడునిమిషాలలో దీచితిని అరణి బళ్ళారి
యిట్టిజగడము నేనుయెక్కడ జూడలేకయ్యా
పల్లెబొబ్బిలి మీద తెచ్చె పాపిష్టిరాజు
యీరీతిగా జెప్పినాడు ప్రాంచిదొరగారు
మూడుపుట్ల నల్లమందుకే సెలవు లిచ్చేను
వుత్తరవు తెచ్చినారు హాయిదరుజంగోజి
మూడుపుట్ల నల్లమందు భూమిన పఱచెను
రవ్వచాలా పఱచెను మందుకు లోగాను
యిచ్చుకత్తులే సానకత్తులు మందున వేసిరీ
నాలుగుప్రక్కల మందుత్రాళ్ళు తగిలించినారు
నిప్పుబెట్టి జాతులవారు వెంబడి యున్నారు
మున్నాటి కవాతు గుఱ్రము ముందుగ నిలిచెను
శ్రీరామాయంటు వస్తున్నారు భేరీస్త్రీలుదా
గుఱ్ఱమని దూకినారు భేరీస్త్రీలుదా
గుద్దుగుద్దుకే చంపినారు గుఱ్ఱము లంతాను
పటాదెబ్బది పదిమంది టాయిగ చచ్చిరి
కత్తులుత్రిప్పి పోయినదూరము పీనుగులు పడినాది
యింతవఱకు గాయములేదు భేరీస్త్రీలకు
నాలుగు ప్రక్కల త్రిప్పినారు కవాతు గుఱ్ఱము
తెలియకవచ్చి నల్లమందులో గొబ్బున దూకిరీ
నాలుగుప్రక్కల నిప్పులయినా పెట్టినారపుడు
భగ్గుభగ్గున రగిలియపుడు మంటలు లేచేను
మలమలయని మాడినారు భేరీస్త్రీలుధా
యీరీతిగా చచ్చినారు భేరీస్త్రీలుదా
అలంగాలకే యెక్కినారు ప్రాంచిదొరగారు
అచ్చటయుండు వెండిబంగారము బండికి యెత్తించి
పుట్టుకోట పరిశుభ్రపరచినారు ఆ నిమిషములోను
పుట్టుకోటలో జండాకొయ్య యెత్తించినారు
పుట్టుకోట పట్టుకొన్నాడు ప్రాంచిదొరగారు
రాజుగారి తెల్లజండా యెత్తించినారు
మూలబురుజు క్రిందవచ్చి మకాము చేసిరి

రామలక్ష్మణ ఫిరంగిలాడ మోహర్జా లేత్తి
అరవై మూడు రేఖలాలుగా మోహర్జా లేత్తిరి
ఫళఫళయని కాల్చినాడు ఫిరంగి యపుడుదా
తొలిదెబ్బకు మూలబురుజు విఱిగి పోయెను
గడ్డగడ్డగా విఱిగియపుడు భూమిన పడినాది
అలంగాలకు యెక్కినాది ప్రాంచిదండుదా
మూలబురుజున వున్నాడండి ముత్యాలపాపయ్య
యీబయిమొగ్గకు యల్మాదొరలు చవుకియున్నారు
అప్పుడేమని జెప్పినాడయ్య ముత్యాలపాపయ్య
అన్నలార తమ్ములార యన్నలార రండు
మించివచ్చెను మించివచ్చెను జగడ మిపుడూడ
రంగయ్యతో జెప్పనుపోతే జాగుయవుతుంది
జగముయుండు కాలమువరకు వుండపోతామా
యిచ్చట చచ్చినవారికి వీరస్వర్గామున్నారు
ధైర్యపు మాటలు జెప్పినాడండి ముత్యాలపాపయ్య
ముందువెనుక చూడవలదు దండుకు లోగాను
యీరీతిగా జెప్పినాడు ముత్యాలపాపయ్య
మీదుబలములు చూపుమయ్య దండుకు లోగాను
బారా తేజీమీదనే యపుడు కొలువు తీరినాడు
చవుకుతోను తట్టినాడు బారా తేజీ
వారివెంబడి వస్తున్నారు యెలమాబిడ్డలూ
దండుమీదనే కలపటమైరి యెలమాబిడ్డలూ
పోటుయీటెలు వేసుకొనిదా తాయిగ దూకిరి
యెక్కివచ్చే ప్రాంచిదండును కన్నుల చూచిరి
పటపటయని కయ్యము చేసిరి రాజుదండుమీదాను
వంచినట్టి యీటెలతోను వాదులు చేసిరి
కోటవెలుపడికి తూకినాడు ముత్యాలపాపయ్యా
దానివెంబడి దుముకినారు యెలమాబిడ్డలూ
మెడనుబట్టి వీపుమీద బాకున పొడిచిరి
మోకాలులోతు నెత్తురుయాడ మొగసిపారేను
తిన్నవంటి పప్పుయన్నము ముందుగ బడినాది
పోయినంతదూరమైన పీనుగులు పడినాది

దండుకునూరు మనుష్యులను నరుకుతు వస్తాను
అప్పుడేమని చెప్పినాడయ్యా హాయిదరుజంగోజి
ఫ్రాంచివారి చేటికివచ్చి హాయిదరుజంగోజి
సలామనగా టోపీదీసెను ఫ్రాంచిదొరగారు
యిప్పుడు జరుగు జగడము యెవ్వరిదన్నాడు
ముత్యాలపాపయ్య జగడమైన జరుగుతుయున్నాది
జయించలేము జయించలేము ఫ్రాంచిదొరగారు
రెండుపుట్ల నల్లమందుకే వుత్తరవు లియ్యండి
రెండుపుట్ల నల్లమందుకే వుత్తరవు లిచ్చెను
రెండుపుట్ల నల్లమందు భూమిన పఱచేను
రవ్వలునిండుగ గలిపినారు దండుకు లోగాను
నాలుగు ప్రక్కల నిప్పులత్రాళ్లు రగిలించినారు
భగ్గుభగ్గున మంటలు యపుడు భగ్గున రగిలెను
ముందుకుముందు దుమికినాడు ముత్యాలపాపయ్య
వెంబడివచ్చిన మొలమాదొరలు మందున కూలిరి
వొంటిగాను నిలిచినాడండి ముత్యాలపాపయ్యా
నిప్పులుపెట్టిన జాతులవారిని గొంతులు కోసేను
వేటువేటునా నఱికినాడు యేనుగు లంతాను
యేనుగుతొండము బట్టియపుడు నేలనుగొట్టెను
యీరీతిగా యున్నాడండి ముత్యాలపాపయ్య
పక్కలో నిలిచియున్నది టుపాకుల బారుదా
యేబయిరెండు టుపాకులాడ టప్పున కాల్చిరి
గప్పుగప్పున కాల్చినారు టుపాకు లపుడుదా
ప్రక్కన తగిలిన గాయములన్ని యెంచతరముగాదు
వీపున తగిలిన గాయములన్ని యెంచతరముగాదు
చుక్కలాగు టుపాకిదెబ్బ నెత్తిన తగిలెను
కడుపులోనిపేగులు జారాడెను ముత్యాలపాపయ్యకు

వ. ఈ విధంబుగా మొలమాదొరలు నిప్పునబడి చావగానే ముత్యాలపాపయ్యకు కోపముగలిగి వొంటిగా యుండుటనుజూచి రాజువారి సైన్యమును జీల్చి చెండాడి టుపాకి దెబ్బలకును వోర్చి తన కడుపులోని పేగులు వ్రేలాడుచుండడముజూచి దానినియెత్తి మఱల కడుపునందుంచి దట్టిగట్టి బంధించి మఱల జగడంబుచేయు విధ మెటులనిన,

కూడుగల్గిన బల్లెంబును చేతను పట్టెను
తటిమితటిమి పొడిచినాడు తొంబయి మందిని
నిల్వజాలక పోయినాడు ముత్యాలపాపయ్య
పీరిచేతిలో చావడమునకు బ్రహ్మ వ్రాసెను
యీరీతిగా యోచించినాడు ముత్యాలపాపయ్య
బాకుతీసి రొమ్మునపొడిచి భూమిన పడినాడు
భూమిమీద పడగానే ప్రాణము విడిచెను
ముత్యాలపాపయ్య చచ్చినాడని ఢంకాకొట్టిరి
మూలబురుజు పట్టుకొన్నాడు ప్రాంచిదొరగారు
రాజుగారి తెల్లజండా యెత్తినారు యపుడు
ప్రాంచివారి నిశాణకొయ్య యెత్తినారు యపుడు
నాలుగుకోటలు పట్టుకొన్నారు ప్రాంచిదొరగారు
నాలుగుకోటలు కొల్లపోయెను బొబ్బిలిలోగాను
బొబ్బిలికోట దిగువవచ్చి మకాము చేసిరి
రామలక్ష్మణ ఫిరంగిలాడ మోహర్లా లెత్తిరి
డాక్వరంబు త్రొవ్వించినాడు డాబాలు పెట్టించి
అరవయిమూడు రేఖలాలుగా మోహర్లా లెత్తిరి
ఫళఫళయని కాల్చినాడు ఫిరంగి లంతాను
దివాణమందు ఫిరంగిగుండు దుముకుతున్నాది
అప్పుడెటుల యున్నాడయ్య రంగయ్యదొరగారు
వచ్చునట్టి ఫిరంగిగుండుల కన్నుల చూచెను
తటుక్కున లేచినాడు రంగయ్యదొరగారు
తమ్ముడియొక్క బేటికియపుడు వస్తూయున్నాడు
అప్పుడెటుల వున్నాడయ్య వెంగళరాయుండు
కోడిపందెము ఆడుతువారు కొలువున యున్నారు
తమ్మునియొక్క బేటికివచ్చి రంగయ్యదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుడా
యింక యేలరా కోడిపందెము వెంగళరాయుడా
కట్టుకోట పుట్టుకోట కొల్లపోయినాది
మూలబురుజు పట్టుకొన్నారు ప్రాంచివారుదా
బొబ్బిలికోటలో ఫిరంగిగుండులు దుముకుతున్నాది
జగడముయిపుడు వచ్చినాది వెంగళరాయుడా

యీరీతిగా జెప్పినాడు రంగయ్యదొరగారు
యంతలో భీరంగిగుండులు దుముకుతు యున్నాది
వచ్చునట్టి భీరంగిగుండులు జవిరి పట్టినాడు
గుండులతోను గుద్దులాడెను వెంగళరాయుండు
అన్నకొలువున పట్టినాడు వెంగళరాయుండు
తామసమేల యింకనాకు సెలవు లివ్వండి
యీరీతిగా పలికినాడు వెంగళరాయుడు
అట్టిమాటలకు యేమనినాడు రంగయ్యదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుడా
నీతోయున్నది నీతోయున్నది బొబ్బిలికోటగా
బొబ్బిలికోట కీర్తిపేరుదా మీరేతెన్నండి
మీదు బలమంతా జూపండయ్య దండుకులోగాను
ముందువెనుక జూడరాదు వెంగళరాయుడా
యీరీతిగా జెప్పినాడు రంగయ్యదొరగారు
అక్కడనుంచి సెలవులుతీసుక వస్తూయున్నాడు
దివాణమొద్దా వచ్చినాడు వెంగళరాయుడు
తన్నుకొలిచే రాణువలంతా తాను బిలచినాడు
వందనమయ్య వందనమయ్య వెంగళరాయుడా
మమ్మునిబిలచిన కార్యమేమి వెంగళరాయుడా
యీరీతిగా యడిగినారు రాణువలంతాను
అప్పుడేమని జెప్పినాడు వెంగళరాయుండు
పరాకుంచక వినుడి యిపుడు యల్మాదొరలారా
జగడమునకు రావలెనుమీరు యల్మాదొరలారా
నాతోకూడా రావలెనయ్య యిపుడు మీరుగా
చావంటే భయపడపోకుము యెలమాదొరలారా
వారివారి దివాణములకు లగువులు తీసిరి
దివ్యయున్న పరమాన్నములు భోజనము చేసిరీ
తాంబూలము చేతపట్టెను యలమాదొరలుదా
జాజిపువ్వుల జల్లడంబులు దిగ్గున తొడిగిరి
రాసిమీదనే వీరగాసులు నడుమున గట్టిరి
పట్టుకుచ్చు సొగసు ఈటెలూ బిరుదులు గట్టిరి
రామరామ రామయటంచు తయారయినారు

వెంగళరాయుని చేటికివచ్చి వందన మొసగిరి
తామసమేల యిపుడుమీారు తయారు కానిండి
చదురువిడిచి లేచినాడు వెంగళరాయుడు
గొట్టడిల్లు తెరచినాడు వెంగళరాయుండు
పెద్దలనాటి పెట్టెలయపుడు నేలదించిరి
పెట్టెలయపుడు తెరచినాడు వెంగళరాయుండు
సరిగాపాగా చక్కగ పెట్టెను వెంగళరాయుండు
సొగసుగ యంగీతొడిగెనయ్యా వెంగళరాయుండు
అంగీమీాద బంగారువంటి దట్టికట్టినాడు
కంఠహారము మెడనుధరించె వెంగళరాయుండు
బంటులజూచి జెప్పసాగెను వెంగళరాయుండు
బొరాతేజిని యిపుడు మీారు చేటికి తెన్నండి
నేలమిద్దెలు భూమికొపులో తేజియున్నాది
పిల్లపిసుగు బొరాతేజిని చేటికి తెస్తారు
వేసినారయా తేజికక్కడ వెండికళ్ళెములూ
కట్టినారు తేజికక్కడ పచ్చలపతకములూ
కళ్ళెములైతే వేసినారు తేజికయ్యె తేను
మెడల్ మీాద జడల్ యపుడు రాయిగ వేసిరి
పట్టుతాళ్ళతో బంధించి బొరాతేజిని
వెంగళరాయుడు చేటికియపుడే తీసుక వచ్చిరి
తేజియొక్క శృంగారములే కన్నుల చూచేను
చదురువిడిచి లేచినాడు వెంగళరాయుండు
చిన్నచెంబు వుదకమపుడు తెప్పించినాడు
తేజియొక్క పాదములు తాను కడిగినాడూ
పాదములకు పూజచేసెను వెంగళరాయుడు
చుట్టువచ్చి వందనమొసగెను వెంగళరాయుండు
అంకెనులోనే పాదములుంచె వెంగళరాయుండు
మెరిగినాదిర బొరాతేజి యోజన పొడుగున
నిలిచినాదిర బొరాతేజి నందముగానుదా
నాలుగుప్రక్కల త్రిప్పినాడు బొరాతేజిని
యేబయిమువ్వురు యెలమదొరలు వెంటనేవచ్చిరి

వ. అప్పుడు ముత్యాలపాపయ్య చావడంలోనే ప్రాంచిదండును రాజగారుదండును కలసి డంకాప్రయోగించి బొబ్బిలి కోటలోగా భీరంగి గుండులు కాల్చుచుండగా భీరంగి గుండులు రంగయ్యాదొరగారి కొలువున పడుచుండడము రంగయ్యాదొరగారుచూచి తమ్ముడు వెంగళరాయుడుండు తావునకు పోయి జగడము యిప్పుడు వచ్చియున్నదని చెప్పగా, వెంగళరాయుడు తామసమేమి మీరు సెలవులిస్తె జగడమునకు పోయెదనని చెప్పెను. వెంటనే వెంగళరాయుడు అన్న సెలవులంది తన రాణువలంతయు బారాతేజని శృంగారించుకొని తేజిని

తట్టుకోట పుట్టుకోట సందుకు వచ్చెను
తట్టుకోట జండాకొయ్య కన్నుల చూచెను
పుట్టుకోట జండాకొయ్య కన్నుల చూచెను
యెంచరాని కోపము గలిగి వెంగళరాయుడికి
పుట్టుకోటలో ప్రాంచివారు పారాలున్నారు
తట్టుకోటలో ప్రాంచివారి పాతాలున్నారు
యెలమాదొరలు తిరిగియపుడు కన్నుల చూచేను
ముందువెనుక జూడవలదు యెల్మాదొరలారా
సయిగచేసి నడిచినాడు వెంగళరాయుండు
పారామీద కలపటమయిరి పారావారుదా
రెండుచేతుల పటాకత్తులు త్రిప్పుచు వచ్చిరి
పారాలమీదనే బోయిదూకెను వెంగళరాయుండు
కళికళికళి కళీయంటూ కార్యము జూచెను
పుట్టుకోటలో యుండేపారా సాపుజేసినాడు
జండాకొయ్య నఱికితోచెను భూమికిపయిగాను
పుట్టుకోటను పట్టుకొన్నారు వెంగళరాయుడు
తట్టుకోట పారాలమీద కలపటమయినారు
తట్టుకోట పారాలన్నియు చంపితోసినాడు
తట్టుకోటలో జండాకొయ్యను భూమిలోదాచిరి
తట్టుకోట పట్టుకున్నాడు వెంగళరాయుడు
మూలబురుజు పారాలమీద కలపటమైనారు
మెడనువంచి వీపునగుద్దిరి బాకుతో యపుడు
మూలబురుజు పారాలన్ని కాపుగ జంపిరి
కోటబయిట దుమికినాడు వెంగళరాయుడు

వానివెంటనే దుమికినారు మెల్మాదొరలుదా

కాలుతో సయిగచేసె బారాతేజికి

వ. వెంగళరాయుడు యీబయిముగ్గురు మెల్మాదొరలును తన్ను వెంబడించిరాగా తట్టుకోట, పుట్టుకోట మూలబురుజును ముట్టడించి యున్న ప్రాంచిదండును పరిమార్చి ప్రాంచి డేరాకు చుట్టువుండు సైన్యములను చంపి డేరాలోనికి పోయిచూచి అచ్చట ప్రాంచిసేనలు రాజు గారి సైన్యమును యంత చంపుతు డేరాలనుచింపి యికయెవరు పెద్దగా నిలిచివున్నారని జూచుచు తన వెంటవచ్చినవారిని తోడ్కొని పోతు న్నాడు శత్రువులను నెదుర్కొని శత్రువులు భీరంగులతోను కాల్చునట్టి తుపాకిదెబ్బలకు జిక్కక సయిన్యమంతయును జంపుతూ అనేకులను జంపి రణరంగమున ప్రఖ్యాతివడసి జనులందరు యింతటి పరాక్రమవం తుని యెట్లు జయించగలమని కలవరపడుతు భయంబు జెందియుండు సమయంబున

తట్టుకోటవదలి పుట్టుకోటకు వస్తున్నాడు
అగడ్తా వెంబడి దూకించెను బారాతేజిని
నాలుగుదిక్కులు జూచినాడు వెంగళరాయుండు
యెటుప్రక్క చూచినగాని దండేయున్నాది
అన్నలార తమ్ములార మెలమాదొరలారా
ముందువెనుక చూడవలదు మెల్మాదొరలారా
చచ్చేటివారికి వీరస్వర్గము యిక్కడ గలుగును
జగముయుండు కాలమువఱకు యుండపోతామా
ధయిర్యపుమాటలు పలికినాడు వెంగళరాయుండు
పూలకోత గోయించినాడు వెంగళరాయుండు
సూర్యపోను వీథులక్కడ యేర్పఱచినారు
హాళ్యాహాళ్యాలు యని తరిమి నఱికినాడు
వంచిన యీటెలమీద వాదులు యాడిరి
ముండమొండెలుగా నఱికితోచెను వెంగళరాయుండు
మూకాలిరక్తము పారునటులుచేసె వెంగళరాయుడు
వేటువేటునా నఱికినాడు యేనుగు లన్నియు
గుద్దిగుద్ది జంపినాడు గుఱ్ఱాల గుంపును
కలగోకలగో యంటువారు వస్తూవున్నారు
పోయినంత దూరముదాక వీనుగులు పడినాది

అన్నలార తమ్ములార యెల్దొరలారా
జత్తులనుజంపిన సార్థకమేమి యెల్దొరలారా
రాజుగారిని జంపిమనము పేరెత్తవలెను
ప్రాంచివారిని చంపిమనము కీర్తిపొందవలెను
ప్రాంచివారి డేరాపక్కకు గుఱ్ఱాన్ని త్రిప్పిరి

వ. పుట్టుకోటనుండు ప్రాంచివారిదండును రాజువారు దండును వోడించి సైన్యమంతయు నానావిధములుగా పారదోలి గుఱ్ఱములను యేనుగులను నతిక్రోమచు వస్తున్నాడు వెంగళరాయుడు అప్పుడు ప్రాంచిదొరగారు హాయిదరుజంగోజితో యేమని అడుగుతున్నాడు.

అప్పుడేమని జెప్పినాడు ప్రాంచిదొరగారు
యిప్పుడుజరిగే జగడముయిక్కడ యెవరిదన్నాడు
వెంగళరాయుని జగడమిప్పుడు జరుగుతు వున్నాది
యధికదండు హతమాయెను ప్రాంచిదొరగారు
డేరాకాడికి వస్తున్నాడు వెంగళరాయుండు
వెంగళరాయుండు యిక్కడవచ్చితె జయించలేమండి
యీరీతిగా జెప్పినారు హాయిదరుజంగోజి
యీమాటలు విన్నాడండి ప్రాంచిదొరగారు
యేనుగుయెక్కి కొండప్రక్కకు ప్రాంచిపోయెను
ప్రాంచిపోయిన సంగతివినినాడు విజయరామరాజు
గుఱ్ఱమునెక్కి వచ్చినాడు విజయరామరాజు
యేరుదాటి వేలూరుకుపోయే విజయరామరాజు
ప్రాంచివారి డేరాచెంతకు వచ్చినిలిచినాడు
ప్రాంచివారి డేరాలోన పోయిచూచినాడు
ప్రాంచిలేదు యెవడులేడు డేరాలోగాను
యెంతనో బలశాలి ప్రాంచిదొరగారు
మీసములులేని యల్పుడునీవు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలమునీకు తెలిసియున్నాది
తెలిసియుండి బొబ్బిలికోటకు యేలవచ్చితివి
వచ్చినవాడు యెదుటనుండక యేలపోతివి
డేరాటంగులు తెంపినారు వెంగళరాయుండు
డేరాగుడ్డలు చింపిలోసెను వెంగళరాయుండు
కిందుమీదుగా చేసినాడు ప్రాంచిడేరాదా

రాజుగారి డేరాచెంతకు గుఱ్ఱముల త్రిప్పెను
డేరాలోగా శోధించినాడు వెంగళరాయుండు
రాజులేరు యెవ్వరులేరు డేరాలోగాను
యెంతగోన బంటువునీవు విజయరామరాజు
కొప్పుబెట్టి కోకలుగట్టి కోటలో యున్నావా
హీనమానము లేనివారు యెందుకు వచ్చితిరి
నీతాత తండ్రులు బొబ్బిలిమీద హతమై పోయారు
తెలిసియుండి బొబ్బిలికోట యెందుకొచ్చితివి
డేరాలన్ని నఱికిత్రోచెను వెంగళరాయుండు
రచ్చబండ రేవులకాడ గుఱ్ఱాన్ని త్రిప్పెను
నిమిషమువఱకు నిదానించెను వెంగళరాయుడు

వ. హాయిదరుజంగోజి యిప్పుడు వెంగళరాయుని జగడము జరుగుతున్నదనగా, ఫ్రాంచియేనుగమీద యెక్కుకొని కొండప్రక్కకు పోయి దాగుకొనెను. ఫ్రాంచిపోయిన సంగతి రాజుగారు తెలుసుకొని తాను గుఱ్ఱంబుయెక్కి వేలూరుకు పోయెను. వెంటనే వెంగళరాయుడు ఫ్రాంచివారి డేరాచెంతకు పోయి డేరాలు చించిచూడగా, ఫ్రాంచి వారు లేకుండుటను జూచి రాజుగారి డేరాకుపోయిచూడగా రాజును లేడు యింత అధయిర్యముగలవారు యేల బొబ్బిలిమీద సయిన్యం బును తెచ్చితిరని హీనపుమాటలు బలుకుచు తనబావమరిది పాపా రాయుడు రాకను జూస్తువున్నాడు

బావమరిది రాకయపుడు జూస్తువున్నాడు
పాపారాయుని రాకయపుడు జూస్తువున్నాడు
యెంతజూచినగాని రాలేదయ్యా పాపారాయుడు
అప్పుడేమని జెప్పినాడు వెంగళరాయుండు
లాల్ఖానుని డేరాయపుడు కన్నుల జూచేను
డేరాను చూచినంతలో కోపము వచ్చెను
అంతలోకి యేమన్నారు మెలమాదొరలుదా
దాహాముదాహాము దాహాముమాకు వెంగళరాయుడా
కోటకుపోయి దాహాముతాగి తిరిగి వచ్చెదము
ఈరీతిగా పలికినారయా మెలమాదొరలుదా
లాల్ఖానుని డేరాయందు కన్నుల జూడండి
డేరాయందు సంగతి తెలిసి యాకలి యెత్తునా

లాల్ఖానుని చంపిమనము కోటకు పోదాము
కోటకుపోయి దాహముతాగి తిరుగ వచ్చెదము
యీరీతిగా పలికినాడు వెంగళరాయుండు
యెంతచూచిన రాలేదయ్యా పాపారాయుండు
లాల్ఖానుని దండు చెంతకు వస్తావున్నాడు
అప్పుడెటుల యోచించెను లాల్ఖానుడయితేను
మూడుపుట్ల నల్లమందు భూమిన పఱచేను
భూమినపఱచి యప్పుడువాడు మందుకులోగాను
కూరుకత్తులు యీటెకత్తులు మందులో వేసేను
మున్నాట కవాతుగుఱ్ఱము ముందుగ నడిపించెను
రామరామ రామాయంటు వస్తావున్నారు
గుఱ్ఱమని దూకినారు యల్మాదొరలూదా
తెలియకవచ్చి నల్లమందులో యపుడే పడినారు
నాలుగుప్రక్కల జానకిత్రాళ్లు తగిలించినారు
భగ్గుభగ్గునా రగిలినాది మందులంతాను
మందుకువెలువడి దుమికినాడు వెంగళరాయుండు
కూడనున్న యెల్మాదొరలూ మందున చచ్చిరి

వ. అప్పుడు యెంతసేపు చూచినగాని పాపారాయుడు రాకుండున, వెంటనే అక్కడయుండు లాల్ఖానుని డేరాజూచి బారాతేజియున్న తన రాణువులనున్న బిలచి అదిగో లాల్ఖానుని డేరా పోయి చంపివస్తామని జెప్పగా, యెలమాదొరలు వెంగళరాయుడా మేము కోటకుపోయి దాహముత్రాగి వస్తామనగా, రాణువలను వెంగళరాయుడు చూచి పగవారిడేరాను చూచి దాహముగొనునా రండీ! మీయిష్టప్రకారము వారిని చంపి కోటకుపోయి దాహముత్రాగి వస్తామని బయలుదేరగ వెంటనే లాల్ఖానుడు నల్లమందుపఱచి వీరికి యెదురుగా కత్తులుపఱచి యున్నారు. అప్పుడు యెలమాదొరలును వెంగళరాయుడునువచ్చి మందునదూకిరి అప్పుడు యెలమాదొరలు మాత్రము మందునకూలిరి. వెంగళరాయుడు మందుకుబైటదూకెను.

వొంటిగా నిలిచినాడు వెంగళరాయుడు
నిప్పులపెట్టె జాతులవారిని గొంతులు గోసేను
జగముచాల చేస్తున్నాడు వెంగళరాయుండు
మందుచుట్టు పారాలన్ని సాపుచేసినాడు

చక్కగా నిలిచియుండిరి టుపాకులబారు
అరవయిరెండు టుపాకులక్కడ టప్పున కాల్చిరీ
ఫళఫళయని కాల్చినారు టుపాకిలంతాను
చుక్కవంటి తుపాకిదెబ్బ నెత్తిన తగిలెను
వీపునతగిలిన గాయాలన్ని యెంచతరముగాదు
సూర్యునిలాగు రక్తమూడ కారుతున్నాది
కండలు పేగులు జీరాడెను వెంగళరాయుడికి
జీరాడే పేగులు లోనత్రోసి దట్టికట్టెను
కూరుకలిగిన బల్యమపుడు చేతబట్టినాడు
తటిమితటిమి నరికినాడు తొంబయ్యి మందిని
నిల్వజాలక మూర్ఛజెందెను వెంగళరాయుండు
వెంగళరాయుడు చచ్చినాడని డంకాకొట్టిరీ
డంకాదెబ్బ విన్నారయ్య కీసుమదాదులుదా
పచ్చలపల్లకి యెత్తినాడు కీసుమదాదులుదా
రెండుచేతుల పటాకత్తులు త్రిప్పుచు యపుడుదా
దండుకులోగా దూరినారు కీసుమదాదులుదా
రచ్చబండ రేవులకాడ తాయిగ వచ్చిరి
వెతుకుతు వెతుకుతు వస్తున్నారు కీసుమదాదులుద
వెంగళరాయుని జేటికివచ్చి కీసుమదాదులుదా
పల్లకియందు వెంగళరాయుని కొలువు తీర్చినారూ
పన్నెండుమంది బోయవారు పల్లకియెత్తిరి
రాజదివాణము తెచ్చినారు వెంగళరాయుణ్ని
బాజారము యెదుటవచ్చెను రంగయ్యదొరగారు

వ. పల్లకిదింపి ముసుకుతీసి మూర్ఛజెందియున్న తమ్ముని జూచి రంగారాయుడు దుఃఖించుచుండ కొంతవడికి మూర్ఛతెలిసిన వెంగళ రాయుడు అన్ననుచూచి కన్నుల నీరుంచినవాడై ప్రాంచివారిచేంట నల్లమందు వున్నందున నీవు జగడమునకుపోతే తిరిగివచ్చుమాట కల్ల కావున రాజస్త్రీలకు ప్రాంచికూడదు తినిపించక చూచుకొనవలసినదని జెప్పి తన యసువులబాయగా జల్లగుంటబయలున వెంగళరాయుని దహనముచేసి మూడు నిమిషములలో కర్మక్రియలు జరిపి ప్రస్తుతి కొలువు నకు పోవుచున్నాడు.

పల్లకిలోన తమ్ముడు యపుడె బ్రతికి యున్నాడు
రవ్వసల్లా ముసుకుతీసి కన్నుల జూచెను
ఘోరుఘోరున దుఃఖించెను రంగయ్యదొరగారు
కుడిభుజము కూలిపోతివా వెంగళరాయుడా
యెంతటిదండులో పోరుచేసితివి వెంగళరాయుడా
యీరీతిగా పలికినాడు రంగయ్యదొరగారు
అంతలోగా మూర్ఛ తెలిసెను వెంగళరాయుడికి
అన్ననుయపుడు కన్నులచూచెను వెంగళరాయుడు
కంటియందు నీరుపెట్టెను వెంగళరాయుండు
జగడమునకు పోతావేమో రంగయ్యదొరగారు
నల్లమందు నయిగలువారికి చాలయున్నాది
జగడమునకు పోతివంటే కోటకు రావయ్య
రాజస్త్రీలకు ప్రాంచికూడు తినిపించవలదు
కోటలోపల కాలిబంధకం కానావున్నాది
బంధకాలు వదలించుకొని తాయిగ పొన్నండి
యిన్నిమాటలు జెప్పియపుడు జీవమిడిచినాడు
జల్లగుంట బయలునందు చిచ్చుబరిపించి
దాహానమపుడు చేసినాడు వెంగళరాయుణ్ని
మూడునిమిషములకు నిత్యకర్మము తానుచేసుకొని
కొలువుచావడికి వచ్చినాడు రంగయ్యదొరగారు
సొగసుదిండ్లు దివాసుమీద కొలువు తీరినాడు
తన్నుకొలిచే రాణువలంతా కొలువుకు వచ్చిరి
ఉక్కథలు యీలాగున్నవి కోటకు లోగాను
మరిదిచచ్చిన సంగతియెరిగెను మల్లమ్మదేవిదా
పెద్దకూతురు సీతమ్మను తాను పిలుచుకొని
చిన్నకూతురు సీతమ్మను తాను పిలుచుకొని
తోడికోడలు సుభద్రమ్మను తాను పిలుచుకొని
యేడుగురు మేనత్తలను తాను పిలుచుకొని
కోటలోయుండు గోపాలస్వామి దేవాలయమునకు
దేవాలయమునకు కదలివచ్చెను దేవీమల్లమ్మా
అభిషేకమును చేసిపెట్టెను స్వామికి యపుడుదా
జాజిమల్లెల పూవులవలన పూజలు చేసెను

తులసిదళములచేత స్వామికి పూజలు చేసెను
స్వామియొక్క శిరమునకు కిరీటము పెట్టెను
స్వామియొక్క నెత్తికి వెండితిరుమణి తాయిగ పెట్టెను
స్వామి భుజములకు శంఖుచక్రముల్ పెట్టెను
సాలుకునూరు చిన్నదివ్వాలు వెలిగించినాది
యెదుటవీధుల గోపాలస్వామిని వేడుకొన్నాది
కలలోవచ్చి సహాయముచేయుచు గోపాలస్వామి
అన్యాయంబు పుణ్యాయంబు తెలియజెప్పండి
యెదుటనిలిచి గోపాలస్వామిని వేడుచున్నాది
కంటినిండా నీరుపెట్టెను గోపాలస్వామిదా
అపశకునంబులు చెప్పుతున్నాడు గోపాలస్వామిదా
నొసటనున్న తిరుమణిరేఖా నేలబడినాది
మెడలోయున్న పూలహారము తెగినేలబడెను
యెదుటనున్న యఖండదీపము గప్పునయారెను
తూర్పునయున్న గోపాలస్వామి పడమట తిరిగెను
పడమటనున్న గాలిగోపురము పటపట పగిలింది
కానరాని చీకటియపుడు కమ్మెను గుడిలోనా
గుడివిడిచి బయటికివచ్చెను మల్లమ్మదేవిదా
అలంగారము యెక్కినాది మల్లమ్మదేవిదా
రాజుగారి డేరాయపుడు కన్నుల చూచేను
మమ్ముచంప మెన్నాళ్ళనీవు మనసుంచినావు
కొండలుపడిన కొన్నాలకయిన కోనలుపడుతుంది
దేవలోకబురు వింటాడయ్యా పాపారాయుండు
రేయిరేయి వస్తాడయ్యా పాపారాయుండు
పట్టెమంచం పరుపుమీద పవళించియుండగా
వాక్కుపోటు పొడుస్తాడయ్యా పాపారాయుడు
పుట్టెడునల్లులు పుట్టెడుగజులూ రొంకరేవులోన
నీదుపెండ్లాము తెంచనుయిపుడు జాతకమున్నాది
రాజదివాణము వచ్చినాది మల్లమ్మదేవిదా

వ. రంగారాయుని భార్య మల్లమ్మదేవి తనమరిది మరణించిన సంగతి తెలిసి తన పెద్దదాది వెంకటలక్ష్మమ్మను పిలిచి తన ముద్దుల కొడుకు సంవత్సరపుబిడ్డ వెంకట్రాయుని వొప్పగించి మూడువేలమం

భిక్షమెత్తుకొని పోయి రాజారములో వున్న పాపారాయుడి చెంత బిడ్డను వొప్పగించు మనుచున్నది.

సంవత్సరముగల చిన్నవాడు వెంకట్రాయుడు
బాలునియపుడు యెత్తుకున్నది మల్లమ్మదేవిదా
చెక్కిళ్లుదువ్వి చేరిముద్దులాడే దేవిగారుదా
కొడకాకొడకా కొడకానీవు వెంకట్రాయుడా
తల్లికడుపున నోచిననోము వెంకట్రాయుడా
కడపటిసారి స్తన్యపానము తాగుర నాతండ్రి
గర్భమునిండా స్తన్యపానము తానేయిచ్చెను
బంగారు గజ్జెలన్ని బిడ్డకు తీసివేసినాది
కాళ్లనుండి కడియాలన్ని తీసివేసినాది
మారువేషము వేసినాది బాలునికయితేను
యందరికయినా పెద్దదాది వెంకటలక్ష్మమ్మా
వెంకటలక్ష్మమ్మను కొలువుకు తాను పిలిచినాది
కంబళివంటి కోకగట్టెను వేంకటలక్ష్మమ్మకూ
మసిగొగ్గు పెట్టినాది ముత్తకు యపుడుదా
డేరాడేరాలుదగ్గెఱ నీవు భిక్షమెత్తుకొని
రాజారము చేరవలెను వెంకటలక్ష్మమ్మా
పాపారాయుడు బేటికియిపుడు మీరే పొన్నండి
యీరీతిగా జెప్పినాది మల్లమ్మదేవిదా
యిక్కడజరిగిన సంగతులన్నియు యింపుతో జెప్పండి
చాపకన్న దరవాజగుండ వారుపోయినారూ
అచ్చటనుండి వచ్చినాది వెంకటలక్ష్మమ్మా
డేరాచెంతయపుడు వెంకటలక్ష్మి భిక్షము యెత్తింది
ఫ్రాంచివారి దండుకులోగా భిక్షమెత్తుకొని

వ. వెంకటలక్ష్మమ్మ బాలుని చంకనిడుకొని ఫ్రాంచివారి డేరా వెంబడి భిక్షమెత్తుకొని పోవుచుండగ రాజు హర్కారులనుబంపి ఆమెను ఫ్రాంచివారి బేటికి రప్పించి ఆ బాలుని చంపవలసినదిగా ఫ్రాంచిదొరకు జెప్పగ అతను బాలునిజంప నిరాకరించి ముప్పయిరెండు పోల్జరులను పారా యిప్పించి ఆమె కోరినచోట విడిచిరమ్మని వుత్తరవు చేయుచున్నాడు.

ఆవేళలో రాజు ఫ్రాంచి పాదిూలయినారు

డేరాజయుట కొలువుతీరిరి వేడుకగాను
రాజుగారి పరీక్ష కపుడే బాలుడు తగిలేను
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
పరాకులేక వినుమయ్యా ప్రాంచిదొరగారూ
బొబ్బిలివారి పోతుదూడగా వెలుపట పోతాది
రాజామరిది చిన్నవాడు వెలుపట బోతాడు
పోనివ్వకు పోనివ్వకు బాలుని యయితేను
చుక్కానియపుడు చేతికందను ప్రాంచిదొరగారు
చుక్కాని చూచినాడు ప్రాంచిదొరగారు
పరాకుంచక వినుముయిపుడు విజయరామరాజా
మన్మధుని సమానముగా వీడుయున్నాడు
చంపరాదు చంపరాదుర బాలుని గనుకాను
ఈరీతిగా పలికినాడు ప్రాంచిదొరగారు
ఈమాటలు విన్నాడయ్యా విజయరామరాజు
ముందుముందు సాధించబోతాడు బాలుడయితేను
శెలవివ్వండి శెలవివ్వండి ప్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నారు ప్రాంచిదొరగారు
హర్కారులను పిలిపించెను ప్రాంచిదొరగారు
వెంకటలక్షిమి జేటికొచ్చిరి హర్కారు లపుడుదా
నీదుపేరు యేమన్నారు హర్కారు లపుడుదా
నాదుపేరు వెంకటలక్షిమి యను పేరుజెప్పినాది
యేయూరు యేపల్లె వెంకట లక్షిమి
కోటలక్రింద పేటలుమాది పాతాచౌకీలూ
ప్రాంచివారు పిల్వమన్నారు వెంకటలక్షిమి
ప్రాంచివారి డేరాచెంతకు తీసుకవచ్చిరి
కోటలక్రింద పేటలుమాది ప్రాంచిదొరగారు
భిక్షమెత్తుక పోతున్నాను ప్రాంచిదొరగారు
మైలవేషము వేసినాది వెంకటలక్షిమి
యింతలోపల యేమన్నారు విజయరామరాజు
రంగారాయుడు కుమారుడు వెంకట్రాయుడు
పోనివ్వద్దు పోనివ్వద్దు వెంకట్రాయుణ్ని
ఆమాటలకు యేమన్నారు ప్రాంచిదొరగారు

పాపకర్ముడు బహుచండాలుడు విజయరామరాజు
కర్మచండాలుడు కులద్రోహి విజయరామరాజు
నెత్తురుముద్ద చంపవలదుర విజయరామరాజు
యింతలోపల యేమన్నారు విజయరామరాజు
చూడగాపసి బాలుడయ్యా ప్రాంచిదొరగారు

వ. వెంకటలక్షుమి దగ్గఱనున్న బాలునితీసుకొని ప్రాంచి దొర గారికి విజయరామరాజు బొబ్బిలివారి సామర్థ్యంబును జూపుచున్నాడు. వొకప్రక్క పండ్లుఫలాదులను యొకప్రక్క చంద్రాయుధమును పెట్టగా బాలుని క్రింద విడువగా బాలుడు చంద్రాయుధమును యెత్తుకొని రాజును చూచెను

బొబ్బిలివారి బలమునుమీరు పరీక్షచూడండి
యీరీతిగా పలికినాడు విజయరామరాజు
యిన్నిమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారు
బాలునియపుడు చేతనుదీసె ప్రాంచిదొరగారు
చెక్కిళ్ళయినా దువ్వినాడు బాలుని మైతేను
తొడలపయి కూర్చుండబెట్టె బాలునయి తేను
చదరుచాలా యమర్చినాడు బాలునయి తేను
వొకప్రక్క పండ్లుఫలాదులు రాసిపోసినాడు
వొక్కప్రక్క చంద్రాయుధము తానుపెట్టినాడు
బాలునియపుడు విడిచిరి విజయరామరాజు
చూదితే బాలుడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలములంత కన్నుల చూడండి
దోగాడుత వచ్చినాడు వెంకట్రాయుడు
పండ్లుఫలాదులు తాకలేదు వెంకట్రాయుడు
డబ్బులుగాని తాకలేదు వెంకట్రాయుడు
చంద్రాయుధము చెంతకువచ్చె వెంకట్రాయుడు
మండివేసి కొలువుతీరెను వెంకట్రాయుడు
చంద్రాయుధము చేతబట్టెను వెంకట్రాయుడు
ప్రాంచివారిని వుఱిమిచూచెను వెంకట్రాయుడు
రాజుగారిని వుఱిమిచూచెను వెంకట్రాయుడు
బాకుయెత్తి వుఱిమినాడు వెంకట్రాయుడు
దిగులుచెంది నిలిచినాడయ్యా ప్రాంచిదొరగారు

తగురానాయన తగురానాయన బొబ్బిలివారికి
క్రూరకర్ముడా కులద్రోహుడా విజయరామరాజా
యింతటి వస్తాదిబిడ్డలూ బొబ్బిలి దొరలూడా
యెంతదూరము పోతున్నావే వెంకటలక్షిమి
యింకొక రాజ్యము నేనుయిప్పుడు పోతున్నాను
మంచిదన్నాడు బాగన్నాడు ప్రాంచిదొరగారు
రాజుగారిని నమ్మలేక ప్రాంచిదొరగారు
ముప్పయియింటికి సోల్జరులను యిప్పుడు పిలిచెను
గాటుయొక్క పారాలిప్పుడు గట్టిగ పొమ్మండి
యెచ్చటనుండి పొమ్మంటాదో వెంకటలక్షిమి
అచ్చటనుండి రావలెనయ్యా పారాచౌకీలూ
యీరీతిగా పలికినాడు ప్రాంచిదొరగారు
అక్కడనుండి వచ్చినారు పారాచౌకీలూ
నల్లకొండ వచ్చినారు పారాచౌకీలూ
కొంతదూరము వచ్చినారు పారాచౌకీలూ
రాజారంపు సమీపమునకు కదలివచ్చినారూ
అక్కడనుంచి పొమ్మన్నాది వెంకటలక్షిమి
రాజారంపు బాటనుత్రొక్క పోతూయున్నాది
ఆక్కడికథలు అలాగున్నది దారికిలోగాను
కోటలోపల యున్నాడయ్యా రంగయ్యదొరగారు
ఆలోచనలు చేసినాడు రంగయ్యదొరగారు

వ. రంగయ్యదొరగారు బావమరిది నరసారాయుని పిలిపించి కోటలో స్త్రీలనందరిని చంపిరమ్మని పంపుచున్నాడు అలాగే అతడు కోటలోని స్త్రీలను శిశువులను నందరిని జంపి కొలువుకురాగా, తన రాణువలలోని వారిస్త్రీలను వూరిలోని స్త్రీలను మందుకొట్లలో తగిల్చి చంపించి, పిదప అందరుకలసి యుద్ధమునకు పోవుచున్నారు.

బావమరిది నరసారాయుని కొలువుకు పిలిచెరు
పరాకుంచక వినుముయిపుడు నరసారాయుడా
కోటలోపల కాలిబందకము చాలాయున్నాది
బందకాలు వదలించుకొని వెంగళరాయుడా
నా చేటికయినా మీరు తయారుగా రన్నండి
చేతనున్న పటాకత్తి చేతికి యిచ్చెను

పటాకత్తి తీసుకొన్నాడు నరసారాయుడు
ఏమి తెలియక నిలిచినాడు నరసారాయుడు
దగ్గఱకపుడు పిలిచినాడు నరసారాయుడు
చిటికవంటి విభూతిని బాగా మంత్రించినాడు
విభూతితీసి మూతినబూసే నరసారాయుడకి
ఓర్చరాని కోపముగలిగె నరసారాయుడికి
రాజదివాణం వచ్చినాడయ్యా నరసారాయుడు
మల్లమ్మదేవి ముందుకువచ్చె నరసారాయుడు
పగడశాల ఆడుతువున్నది దేవిగారుదా
అన్నదమ్ముని కన్నుల చూచెను దేవిగారుదా
పెనిమిటిరొయిక పటాకత్తిని కన్నుల చూచెను
పరాకుంచక వినుమయ్యా అన్నయ్యగారూ
వచ్చినపనులు కానివ్వమయ్యా అన్నయ్యగారు
వెనుకనున్న కీలుగంటు ముందుగ వేసెను
కొయ్యమని మెడవంచెను దేవిగారుదా
గరగరగర గరగరయంటు గొంతుకోసినాడు
పెద్దకూతురు పెరుందేవిని గొంతుకోసినాడు
నడిమికూతురు కాంతమ్మను గొంతుకోసినాడు
చిన్నకూతురు సీతమ్మను గొంతుకొసినాడు
ఏడుగురు మేనత్తల గొంతుకొసినాడు
తోడికోడలు చంద్రమ్మను గొంతుకొసినాడు
ధర్మారాయుని భార్యయైన రమణమ్మ దేవిదా
నిండుగర్భమున యున్నాదయ్యా రమణమ్మదేవిదా
అప్పుడేమని పలికినాడు నరసారాయుడు
యింటరాదు ముట్టకూటదు రమణమ్మదేవిని
మొలలోయున్న చంద్రాయుధము బర్రున దూసెను
బాకుమొత్తి ముందుగవేసెను నరసారాయుడు
అప్పుడేమని చెప్పినాడుర రమణమ్మదేవిని
మండివేసి కొలువుతీరెను రమణమ్మదేవి
బాకుమొత్తి రొమ్మున వేసుక పడినాది
గర్భముయపుడు చీల్చినాడు ధర్మారాయుడు
నెత్తురుముద్ద శిశువునుదాని ఎగర వేసినాడు

పటాకత్తి యెదుటబెట్టెను ధర్మారాయుండు
వేటుయొకటి తునకలురెండు భూమిన పడినాది
బంధకాలు వదలించుకొని ధర్మారాయుండు
రంగారాయుని చేటికివచ్చెను నరసయ్యాగారు
బంధకాలు తీర్చుకొని బావరంగయ్య
తన్నుగాలిచే రాణువలంతా తానుబిలిచినాడు
మీబంధకాలు వదలించుకొని నాచేటికి రన్నండి
యీరీతిగా జెప్పినాడు రంగయ్యదొరగారు
వారివారి దివాణములకు కదలి వచ్చిరి
తలలుపట్టి గొంతులుకోసిరి యెలమాదొరలుదా
భార్యలనంతయు గొంతులుకోసిరి యెల్మాదొరలూద
బాలులనత్తి గొంతులుకోసిరి యెలమాదొరలూద
వారివారి బంధకాలు వదలించుకొన్నారు
కోమటివీదులు బ్రాహ్మణవీధులు పూరావున్నాది
యొంటరిని చంపుదుమయ్య రంగయ్యాదొరగారు
మందుగిడ్డంగి పగులగొట్టండి రాణువులార
మందులపటిచి కాల్చండి సయినికులార
మందుకొట్టడి లోపలయప్పుడు స్త్రీలను తరల్చి
తలుపులుమూసి తగలపెట్టండి యెల్మాదొరలూదా
యీరీతిగా జెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
మందుగిడ్డంగి పగులగొట్టిరి యెల్మాదొరలూదా
తలుపులుమూసి రగలబెట్టిరి యెల్మాదొరలూదా
గుంపులుగాను రగిలినారు స్త్రీలందరూను
దీపముపెట్టను దిక్కులేదు కోటకు లోగాను
రంగారాయుడి చేటికివచ్చిరి యెలమాదొరలూదా
కామసమేమి యింకమీరు యెలమాదొరలుదా
బంగారు వెండినంతయు తెప్పించెను రంగయ్యాదొరగారు
యినుపరొక్క హుండీలను తెప్పించినాడు
హుండీలోపల వేసినారయ్యా రంగయ్యాదొరగారు
యినుపగొలుసులు తగిలించిరీ హుండీలకుదా
యినుపరోకళ్లు తెప్పించినాడు రంగయ్యాదొరగారు
గొలుసులకు తగిలించెను రోకళ్ళంతాను

బొబ్బిలిదొర రంగారాయుడు వస్తున్నాడు
రంగారాయుని యెదురుగమీరు తాయిగ పొన్నండి
కోలుకోలు కోలుయంటు యెదురుగ పొన్నండి
యేమికోలు యనియడిగితే రంగయ్యదొరగారు
యెప్పటివలెనే బొబ్బిలికోటలు యేలుకొన్నండి
మీలవుత్తరవు తెన్నండోయి హర్కారులుమీరు
యీరీతిగా జెప్పినాడు ప్రాంచిదొరగారు
రంగయ్యదొరగారు యెదుట తాయిగవచ్చిరి

వ. అంతట ప్రాంచి హాయిదరుజంగుని పిలిపించి ఇపుడు మన సయిన్యములో జొరబడి చండభానునిరీతి కయ్యముచేయు వీరుడెవడని యడుగగా, బొబ్బిలికోటనేలు రంగయ్యదొరగారు విడివడి మన సైన్యమును చెల్లాచెదరు చేయుచున్నాడు తెలియక మనము రాజమాటలు విని యిట్టి యిక్కట్టున జిక్కితిమనగ, ప్రాంచి భ్రమించినవాడై యెప్పటియట్లు తమ బొబ్బిలికోట తామేలుకొండని రంగయ్యతో జెప్పి అతని చెంతనుండి బదులు తెమ్మని తన భటులను పంపుచున్నాడు.

కోలుకోలు యంటువారు యెదుటనే వచ్చిరి
యేమికోలు మాకిచ్చెదరు మాయన్నలారమీరు
యెప్పటివలెనే బొబ్బిలికోటలు యేలుమన్నారు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
చాలుచాలు చాలించవోయి కాతులు మీరుదా
అన్నదమ్ములూ బావమరదులూ యందరు చచ్చిరి
వొంటిగాడు నేనయితిని కోటలు యెందుకు

వ. ప్రాంచిపంపిన హర్కారులు రంగారాయుని సమీపించి కోలుకోలు, యెప్పటివలెనే బొబ్బిలికోటను మీరే యేలుకొండనగా, అన్నదమ్ములు బావమరదులు బంధువులందరు చచ్చినవెనుక యొంటరిగాడై నిలచిన నాకెందుకని రంగారాయుడు తన సయిన్యములకు జగడము చేయుడని కనుసయిగచేసి తానును సమరముచేయ నిశ్చయించుకొని దిగబడుచున్నాడు.

కన్నుసయిగ చేసినాడు రంగారాయుడు
ముప్పయియింటికి పుక్కుజీవుల కాతుల చంపిరి
గిరగిరమని తిరిగియపుడు భూమిన పడినారు

మరుజవాబు లేకపోయె ప్రాంచివారికిని
అప్పుడెటులా యున్నాదండి ప్రాంచిదొరగారు
యేనుగనెక్కి కొండప్రక్కల ప్రాంచిపోయినాడు
ప్రాంచిపోయిన సంగతి తెలిసి రాజుగారిని
యేరుదాటి యేలూరుకు తాను పోయినాడు
అక్కడనుంచి వచ్చెను రంగారాయుండూ
ప్రాంచివారి డేరాతావుకు తాయిగ వచ్చెను
డేరాలోగా శోధించెను రంగారాయుండూ
ప్రాంచిలేదు యెవ్వరులేదు డేరాలోగాను
యెంచరాని కోపముగలిగే రంగారాయుడికి
పిటికిబంటు పీడుయిపుడు యెందుకు వచ్చెను
మీసములేని బేడివాడు యెందుకు వచ్చెను
డేరాటంగు త్రాళ్ళయపుడు తాయిగ తెంపిరీ
క్రిందుమీదుగా చేసినాడు డేరాలంతయును
ప్రాంచివారి దండుకు పయిగా బాగుగ వచ్చెను
అచ్చటనుండి వస్తున్నాడు రంగారాయుండు
రాజుగారి డేరాతావుకు తాయిగ వచ్చిరీ
రాజులేదు యెవ్వరులేదు డేరాలోగాను
పరాకుంచక వినుముయిపుడు విజయరామరాజు
బొబ్బిలివారి బలమునీకు తెలిసియున్నాది
నీతాతతండ్రులు బొబ్బిలిమీద హతమయిపోయిరీ
పుట్టినచోట చావడానికి బ్రహ్మవ్రాయలేదు
బొబ్బిలిమీద చావడానికి బ్రహ్మవ్రాసినాడు
హీనముమానము లేకయిపుడు యెందుకొచ్చితివి
మీసములేక యేలనీవు యిక్కడకొచ్చితివి
వచ్చినవాడు యెదుట నిలువక యేలబోతివి
ఈలాగున దూషించినాడు రంగయ్యదొరగారు
డేరాటంగు త్రాళ్ళనుయపుడు తెంపుగ తెంపిరీ
క్రిందుమీదుగా చేసినాడు రంగయ్యదొరగారూ
రాజుగారి దండుమీద టాయిగ దుమికెను
డేరావిడిచి బయటికి వచ్చెను రంగారాయుడుదా
నాతమ్ముడు చచ్చినచోట యేదిర యిపుడుదా

వ. అని యడిగి, లాల్ఖానుడే తన తమ్ముని మరణంబునకు కారణ
మని తెలిసికొనినవాడై పట్టరాని కోపంబున తాను లాల్ఖానుని డేరా
పోవుచున్నాడు.

లాల్ఖానుని డేరాయపుడు కన్నుల చూచెను
లాల్ఖానుని డేరా పుర గుఱ్ఱమును త్రిప్పెను
దండుమీద కలపటమయిరి యలమాబిడ్డలుదా
హోళ్యాలు హోళ్యాలుచేసి యపుడు తఱిమినఱికినారు
యచ్చటయున్న పారాలన్ని సాపుగ చంపిరీ
లాల్ఖానుని చేటికివచ్చె రంగయ్యదొరగారూ
అపుడెటుల యున్నాడండి లాల్ఖానుండయితేను
యేనుగమీద అంబారిపయి కొలువై యున్నాడు
తేజీకియపుడు చిమటా యిచ్చెను రంగయ్యదొరగారు
యేనుగయొక్క కుంభస్థలముమీద తేజీపాదములు
యొకటిరెండు మూడుతూర్లు బాణము వేసెను
యెడమచేతితో దట్టెనండి రంగయ్యగారు
నీదుచెయ్యి ముందుమించెర లాల్ఖానుడపుడు
నాదుచెయ్యి వస్తున్నాగి యనగ కట్టుకోర
పటాతోను నఱికినారు రంగయ్యదొరగారు
హాల్లారే హాల్లారేయంటు భూమిన పడినాడు

వ. ఈలాగు లాల్ఖానుని నఱికి క్రిందతోసి హాయిదరుజంగుమీది
తిరుగబడి యేనుగులను పీనుగులుచేసి, మాష్టీకులను మట్టిన కలి
ఫిరంగిబండ్లను తుత్తునియలు చేసి ఫ్రాంచి సయిన్యములను చెండా
రక్తప్రవాహములు పారునట్లుచేసి ఆ ప్రవాహమున తలలు మొం
ములు తేలి ప్రవహించుటనుజూచి హాయిదరుజంగు యింకను బొబ్బి
వారిని చేత జగడంబున జయించలేమని నల్లమందు భూమినపతి
నాలుగుతట్లును నిప్పంటించగా ఆ మంటలోనికి యెలమాబిడ్డలున
బారాతేజియును చావగా రంగయ్య మాత్రము మంటనుండి బయట
పడి రాగలిగినాడు.

హాయిదరుజంగు దండుమీదికి కలపట మయినారు
బల్యముమీద చవుకరించెను సయిన్యమంతయు
యెగిరియెగిరి చంపినాడండి గుఱ్ఱముల గుంపును
తఱిమితఱిమి చంపినాడండి యేనుగుల గుంపును

మాష్టికులను గొట్టియపుడు ముందుగ వేసెను
మొగిరితన్న భీరంగిబండ్లు యిరుసులు యిరిగేనూ
రక్తములోనే మొండెములన్ని పయికి తేలింది
అరవయిమూడు రేఖలాలుగ మొహార్జా లెత్తిరీ
ఫళఫళయని కాల్చినారు భీరంగి యపుడుదా
వెనుకప్రక్కన యున్నారండి హయిదరుజంగోజి
జయించలేము జయించలేము రంగారాయుడితో
అయిదువుట్ల నల్లమందు భూమిన పఱచిరీ
వుక్కకత్తులు సానకత్తులు మందున వేసిరీ
రవ్వలుచాల వేసినారు మందుకు లోగాను
నాలుగు ప్రక్కల మందుత్రాళ్లు తగిలించినారు
మున్నూటి కవాతుగుర్రము ముందుగ నిలిపిరీ
గుబ్బుమని దూకినారు యలమా బిడ్డలుదా
తెలియకవచ్చి నల్లమందులో గప్పున పడినారు
నాల్గుప్రక్కల మందుత్రాళ్ళకు నిప్పులు పెట్టిరీ
భగ్గుభగ్గునా రగిలినాదండి మందులు యపుడుదా
మందుకువెంబట దుమికినాడు రంగారాయుడూ
కూడాయున్న యల్మాదొరలూ మందున గూలిరీ
రంగారాయుని బారాతేజి మందున చచ్చింది
వొంటిగాను నిలిచినాడండి రంగారాయుడూ

వ. తనవెంటవచ్చిన యెలమాదొరలు మందున మాడిపోగ జూచిన రంగారాయుడు పట్టరాని కోపము గలవాడయి శత్రుసయిన్యముల పయిబడి నిప్పులు పెట్టిన జాతుల వారిని తఱిమి తఱిమి గొంతుల కోసినవాడై వీరవిహారము సలుపుచు రంగారాయుని కాటులకు తాళలేక తుపాకులను బారుతీర్చి గురిపెట్టి కాల్చసాగినారు.

నిప్పులుపెట్టిన జాతులవారిని గొంతులు కోసేను
తఱిమితఱిమి నఱికినాడండి రంగారాయుడూ
అరవయిరెండు తుపాకులంత మోహార్జాలెత్తిరీ
ఫళఫళమని కాల్చినారు టుపాకిలంతాను
చుక్కవంటి టుపాకిదెబ్బ నెత్తి తగిలెను
వీపున తగిలిన గాయాలన్ని యెంచతరముగాదు
నెత్తురయపుడు కారుతున్నది రంగారాయుడికి

పేగులు కండలు జీరాడెను రంగారాయుడికి
జీరాడు పేగులనెత్తి దట్టిలో గట్టెనూ
తఱిమితఱిమి నఱికినాడు తొంబయి మందిని
నిల్వబలములేక క్రుంగెను రంగయ్యదొరగారు
యింతబ్రతుకు బ్రతికినేను వీరిచేతిలోన
వీరిచేత చావనునాకు జాతకమున్నదా
మండివేసి కొలువుతీరెను రంగయ్యదొరగారు
బాకుయెత్తి విసరివేసెను రంగయ్యదొరగారూ
బాకువచ్చి రొమ్మునతగిలి భూమిని పడినాడు
మండిమీదనే జీవమువిడిచే రంగయ్యదొరగారు
రంగారాయుడు చచ్చినాడని ఢంకాకొట్టిరీ
పారిపోయిన దండుతిరుగా వచ్చిచేరినాది

వ. శత్రువులు పేల్చిన తుపాకిదెబ్బ రంగారాయుని నొప్పచుక్కవలె గాయపఱచినదిగాక దేహమంతట యెన్నరాని గాయములు గలిగి ప్రేగులు బయటికి బయల్పడగా, జీరాడుపేగులనుయెత్తి దట్టిలో గట్టి, మఱియును యిసుమంతయు జంకక శౌర్యముజూపి శత్రుసయిములను చెండాడి మఱినిల్వలేకపోగా విరోధులచేత జిక్కకుండ తనచేతిబాకుతో రొమ్మున పొడిచికొని భూమిపయిబడి ప్రాణముల విడువగా, రంగారాయుడు చచ్చినాడని డంకామ్రోయగ, ఫ్రాంచియును విజయరామరాజును వారి సయినికులును తిరిగివచ్చి రంగారాయుని చూడసాగిరి.

కొండదాటి వచ్చినాడు ఫ్రాందొరగారూ
రంగారాయుని జేటికి యవుడు వస్తూవున్నాడు
రాజగారు ఫ్రాంచివాడు షామీలయినారు
రంగారాయుడి చక్కదనము జూడవస్తారూ
అంతలోకి యేమన్నాడు విజయరామరాజు
నమ్మవలదు నమ్మవలదు బొబ్బిలివారిని
వచ్చినాడని దగ్గఱకయినా మనమే పోలేను
దిగ్గునలేచి లడాయిచేతురు బొబ్బిలి దొరలూదా
యీరీతిగా పలికినాడు విజయరామరాజు
యీటితోను కదిలించినాడు రంగారాయుని
బొందెలోను జీవములేక తానేయున్నాడు

వ. ప్రాంచియు, విజయరామరాజును రంగారాయుని మృత శరీరముండుచోటికి చేరుసరికి బొబ్బిలివారిని నమ్మవలదు చచ్చినట్లు బడియుండి శటాలున లేచి లడాయి చేయగలరని రాజు చెప్పగ దూరముగ నుండియే ఈటెమొనచే కదల్చిచూచి రంగయ్య శరీరమున ప్రాణములేదని ఝొటింగి దగ్గఱకువచ్చి అయన వీరచిహ్నములచూచి ప్రాంచి దుఃఖించుచున్నాడు.

దగ్గఱకయినా యపుడువచ్చెను ప్రాంచిదొరగారు
వొడ్డుపొడుగు చక్కదనము కన్నుల చూచెను
వీపునందు వింజామరలే రంగయ్యాదొరకు
బొడ్డునందు చింతామణియు రంగయ్యాదొరకు
ముంజేతికి మీసమున్నది రంగారాయునికి
రాజచిహ్నముల కన్నులజూచె ప్రాంచివారుదా
ఘోడుఘోడున దుఃఖించినాడు ప్రాంచివారుదా
తెలియక నేను బొబ్బిలివారిని చంపుకొంటిని
క్రూరకర్ముడు కులద్రోహి విజయరామరాజు
కర్మచండాలుని మాటలుచాల నేనువింటిని
పాపిచండాలుని మాటలుచాల నేనువింటిని
యిటువంటి వస్తాదులు భూమిన యుండేను
ఈరీతిగా దుఃఖపడెను ప్రాంచివారుదా
చాలాసేపు వ్యసనముజెందెను ప్రాంచివారుదా
దహనమయిన చేసినాడు ప్రాంచిదొరగారు

వ. రంగారాయుని మృతకళేబరమును చూచి ఆయన శరీరమునందలి వీరచిహ్నముల చూచిన ప్రాంచిదొర గోడుగోడున దుఃఖించినవాడయి పాపిష్టి విజయరామరాజు మాటలను విని యిటువంటి వస్తాదిబిడ్డను పోగొట్టుకొంటినని చింతించి రంగారాయుని దేహమును వీరులకు చేయదగిన మరియాదలతో దహనము చేయించెను.

రాజవారు ప్రాంచివారు సామీలయినారు
బొబ్బిలికోటకు వచ్చినారు యిరువురు యపుడుదా
కోటలోను శోధించినారు యిరువురు యపుడుదా
యెపక్క చూచినగాని స్త్రీల మరణంబు
యేనగరిలో జూచినగాని శిశువుల మరణంబూ
అప్పుడేమని పలికినాడు ప్రాంచిదొరలుదా

స్త్రీహత్యయు శిశుహత్యయు యెవరిదన్నాడు
స్త్రీహత్యయు శిశుహత్యయు నాదేయన్నాడు

ఏ. రంగారాయుని శరీరమును దగిన మర్యాదలతో దహనము చేసి పెదప రాజును ప్రాంచియును గలిసి బొబ్బిలికోటలోనికి జొరబడి జూడగ యేచోటజూచినను స్త్రీల మృతకళేబరములను శిశువుల మృతశరీరములును పీనుగుల పెంటలయి కనబడగ వాటినికాంచి భ్రమించినవాడయి రాజునుచూచి ఈ స్త్రీహత్యయు శిశుహత్యయు యెవరిదని యడిగిన తనదే యని వొప్పుకొంటాడు.

దండుకురాజు యేనుబండులే కట్టించినాడు
పీనుగులయినా మెత్తించినాడు ప్రాంచిదొరగారు
మూడు చెరువులే మిక్కుటమైనాది పీనుగులంతాను
కోటయంత శుభ్రపరిచెను విజయరామరాజు
తెల్లవారితే రాజుగారికి పట్టము గడుతాము
డేరాదగ్గరకొచ్చినారు యిరువురు యపుడుదా
దిగులుతీరి డేరాలోగ వారేయున్నారు

వ. రాజుగారును ప్రాంచిగారును తమ సైన్యముచే కోటలోని పీనుగుల పెంటలను మెత్తి పూడ్పించగ మూడుచెరువులకు నిండినది. అటుపిమ్మట కోటయంతయు శుభ్రముచేసి తెల్లవారితే రాజుగారికి పట్టముగట్టుటకు తీర్మానించినవారై వారివారి డేరాల కరిగిరి.

ఈ కథలు ఈలాగున్నది బొబ్బిలిలోగాను
మూడోరోజు డాకలయినాది వెంకటలక్ష్మమ్మ
రాజారము చేరినాది వెంకటలక్ష్మి
వెంకట్రాయుని చేతికియిచ్చె వెంకటలక్ష్మి
పరాకుంచక వినుముయిపుడు పాపారాయుడా
నిండుకొలువున వున్నాడండి పాపారాయుండు
బాలునియపుడు చేతికిచ్చెను వెంకటలక్ష్మమ్మా
అప్పుడుయేమని యడిగినాడు పాపారాయుండు
బావగారు రంగయ్యగారు వస్తావున్నార
అప్పచెల్లెలు మల్లమ్మదేవి వస్తావున్నాదా
పల్లకిలేదా సవారిలేద వెంకట్రాయునికి
వొంటిబాటి రావనేల వెంకటలక్ష్మమ్మా
వొంటిగాను వెంకట్రాయుని మొత్తుక వస్తివి

అట్టిమాటలకు యేమన్నాది వెంకటలక్ష్మమ్మా
పరాకుంచక వినుమయిపుడు వెంగళరాయుడా
కోటవిడిచి మీరువచ్చిన తొమ్మిదవనాడు
కోటమీదికి దండు తెచ్చెను విజయరామరాజు
యెంచిచూడగ ఫ్రాంచివారిని తెచ్చిపెట్టినాడు
కోటకునాలుగు ప్రక్కలను ముట్టడించినాడు
మూడుదినములుదాక జగడము జరుగుతున్నాది
మీచోటికి పంపినారు మల్లమ్మదేవిదా

వ. బొబ్బిలికోటనుండి బాలుని వెంకట్రాయుని ఎత్తుకొని బయలుదేఱిన వెంకటలక్ష్మి మూడోనాటికి రాజారంపు కోటను చేరి పాపారాయుని దర్శించి బాలుడు వెంకట్రాయుని అతని చేతకప్పగింప అప్పచెల్లెలు మల్లమ్మగారు వచ్చుచున్నారనియు పల్లకి సవారియు లేక బాలుని యెత్తుకొని వొంటిగారిని వచ్చుటకు కారణమేమని యడుగగ పాపారాయుడు కోటనుడిచి వచ్చిన తొమ్మిదివదినము విజయరామ రాజు ఫ్రాంచితో కలసి కోటను ముట్టడించినదియు, మల్లమ్మదేవి బాలుని తనచేతికిచ్చి పాపారాయుని దగ్గఱ వొప్పగించమన్నదియు, తాను మారువేషమున బాలునెత్తుకొని సయిన్యములో భిక్షమెత్తు కుంటురాగ రాజభటులు తన్ను రాజుకు వొప్పగించినదియు, రాజు బాలుని చంపవలెననగా, ఫ్రాంచి వాదించి దగిన కావలివారలనిచ్చి తన్ను సయిన్యము దాటించినదియు ఫ్రాంచివారి దయచే తాను అచటికి వచ్చినంతవఱకు జరిగిన విషయములను తెలిపి బొబ్బికోటలో మూడుదినములనుండి జగడము జరుగుచున్నదనియు వెంకటలక్ష్మి పాపారాయునికి జెప్పినది.

ఈమాటలు విన్నాడయ్యా పాపారాయుండు
యెంచరాని కోపముగలిగె పాపారాయునికి
యింతపనికి వచ్చినాడా విజయరామరాజు
నేనుకోటలోపల లేకచూచి విజయరామరాజు
కోటలయినా గోలుపుచ్చినా విజయరామరాజు
ఈబాటలో వస్తాడని దోవకాచినానూ
దొంగముచ్చుగా దుమికినాడా విజయరామరాజు
మూడుదినములనుంచి జగడము జరిగితేను
కబురులేక జేసినాడా రంగయ్యగారూ

రాజువచ్చే సమయముజూచి వెంగళరాయుడా
కొంతసంగతి జెప్పకపోతివి వెంగళరాయుడా
నల్లయేరు దాటనిత్తునా రాజును నేనుదా
యింతసేపు నిలువనిత్తునా కోటల క్రిందను
తట్టుకోటకు బలియిత్తును రాజగారిని
పుట్టుకోటకు బలియిత్తును ప్రాంచిగారిని
మొరుకలేక జేసినాడు వెంగళరాయుడు
మంచిదన్నారు బాగన్నారు పాపారాయుండు
తన్నుకొలిచే శాణువలంతా తాను బిలిచినాడు
సింహాసనము వేసినారు వెంకట్రాయునికి
సింహాసనము కొలువుతీరెను బాలుడు గనుకాను

వ. వెంకటలక్ష్మిచే బొబ్బిలికోటలో జరిగిన సంగతు లన్నియు విన్న పాపారాయునికి విజయరామరాజుపై యెక్కడలేని కోపము గలిగినవాడై రాజబాటయందు వస్తాడని బాటకాచియుండగ నన్ను మోసగించి దొంగముచ్చువలె అడ్డదారిన బొబ్బిలికోటను ముట్ట డించుటవలన తనకాపుదల వ్యర్థమైనందులకు మనమున చింతించి మూడుదివములనుండి కోటను ముట్టడించి జగడము జరుగుచున్న సంగతి రంగారాయుడు తనకు కబురుచేయకపోగా వెంగళరాయుడై నను తనకేల యెరుకపరచకపోయెననియు అటులు తనకు కబురు పంపినయెడల నల్లయేరు దాటనివ్వననియు యింతసేపు బొబ్బిలికోట దగ్గర రాజును నిలువనివ్వననియు తట్టుకోటకు రాజగారినిన్ని పుట్టు కోటకు ప్రాంచివారినిన్ని బలియిచ్చియుండుననియు చింతించినవాడయి జరిగిన కార్యమునకు వగచుట పాటిగాదు అని దలచి బాలుడు వెంక ట్రాయుని సింహాసనమున కూర్చుండబెట్టి తన సయిన్యములను పిలి పించి యుద్ధయాత్రకు తయారయి బోవుచున్నాడు.

పరాకుంచక వినండిమీరు యెల్మాదొరలారా
కాశిప్రయాణం తగిలిందయ్యా యెలమాదొరలార
మూడునెలలు కాశియాత్రలు పోయివచ్చెదము
ఆరునెలలు బలమంత యిప్పుడుయిచ్చేను
ముందునిలిచి వందనమొనగెను వెంకట్రాయునికి
చిన్ననాటి స్నేహితుడయ్యా మద్దాలవెంకన్న
మద్దాలవెంకన్న యనేటివానిని కొలువుకుపిలిపించె

సేవకుడయిన మిరియాలశీతన్నను కొలువుకుపిలిపించె
కాశియాత్రల పోయివత్తుము మనమునేడుదా
మంచిదన్నాడు బాగన్నారు మద్దాలవెంకన్న
అప్పుడేమని పలికినాడు పాపారాయుడు
అన్నలారా తమ్ములారా యల్లాదొరలారా
చక్కగను చాకండయ్య వెంకట్రాయున్ని
నారీతిగా వెంకట్రాయుని జూస్తువున్నండి
పరాకుంచక వినవేతల్లి వెంకటలక్ష్మమ్మా
బాలునియపుడు సాకుతుండవే వెంకటలక్షుమి

వ. బాలుని సింహాసనమున కూర్చుండబెట్టి రాజారంపు కోటలో తన్నుకొలిచేటి యెలమదొరలను కొలువుకు పిలిపించి బాలుడు వెంకట్రాయుని తనమాదిరి చూచుకొనవలసినదనియు, వెంకటలక్ష్మమ్మకు బాలుని చాకుతుండవలెనని జెప్పి బాలుని వారికి వొప్పగించి తనచిన్ననాటి స్నేహితుడు మద్దాల వెంకన్నయును తన సేవకుడయిన మిరియాల సీతన్నయును పాపారాయుడును ముగ్వురు బొబ్బిలికి ప్రయాణమై వచ్చుచున్నారు.

ఈరీతిగా జెప్పివారు ప్రయాణమైనారు
ముగ్వురు గుఱ్ఱములతో ప్రయాణమైనారు
కొంతదూరం కాశియాత్రలు వారు నడచినారు
అక్కడనుంచి వచ్చినారు బొబ్బిలికై తేను
బొబ్బిలివారి దేవిడిముందర రక్కసమండ్యాలు
రక్కసమండ్యాల పద్దిమానులకే గుఱ్ఱాలుగట్టిరి
కోటలక్రింద యపుడువచ్చిరి ముగ్గురుయపుడుదా
కోటలను నాలుగుప్రక్కల కన్నులగాంచిరి
మల్లమ్మదేవి రాజదివాణములకు బయలువెడలిరి
దీపముపెట్టను దిక్కులేదయ్యా కోటకులోగాను
గోడుగోడున దుఃఖించినాడు పాపారాయుండు
చాపకన్ను దరవాజగుండ బయటికివచ్చిరి
చెరువులోకి బయలుదేరె పాపారాయుడు
కోటవీనుగులలోపల చెల్లెలుని వెతకిపట్టినాడు
అప్పచెల్లెలు మల్లమ్మదేవి శిరస్సుగనుకాను
దహనమపుడు చేసినాడు పాపారాయుడు

నిమిషంబున నిత్యకార్యము తాను చేసినాడు

వ. ఈరీతిన వారు మువ్వురును బొబ్బిలి దేవిడిముందర రక్కా-సుల మంద్యాలకాడికివచ్చి అచ్చటి మద్దిమాకులకు గుఱ్ఱాలనుకట్టి కోటలోనికిపోయి నాలుగు ప్రక్కల కలయచూచి మల్లమ్మదేవి రాజ దివాణంవచ్చి కోటలోగా దీపముపెట్టను దిక్కులేక పోయినందుకు చింతించి చాపకన్ను దరవాజగుండ బయటికివచ్చి చెరువులోని కోటి పీనుగులలోపల తమ అప్పచెల్లె మల్లమ్మదేవి శిరస్సును వెతకిదీసి దానిని దహనముచేసి నిమిషమున నిత్యకర్మములు జేసి ముగించి తమ గుఱ్ఱములు వున్న చోటికివచ్చి వాటిని చంపి తదుపరి కార్యంబును యోచించుచున్నారు.

గుఱ్ఱాలముందు వచ్చినాడు పాపారాయుడు
పరాకుంచక వినండిమీరు మద్దాల వెంకన్నా
వొంటివారి మనప్రాణములకు గుఱ్ఱాలు యెందుకు
వారివారి గుఱ్ఱములపట్టి యప్పుడె చంపిరీ
యోచనలు చేసినాడు పాపారాయుండు
తూర్పుసీమ రాజులవేషము వారు వేసుకొన్నారు
రొమ్మునందు జంజము వేసిరి మువ్వురు యపుడుధా
బొమ్మంచు దోవతులనపుడు బిగియ కట్టినారు
జోడుదుమాలును ధరించినారు మువ్వురు గనుకాను
అచ్చటనుండి వచ్చినారు మువ్వురు యపుడుదా
కాగితము పేనాయపుడు చేతను బట్టిరీ
అన్నకొడుకు ఆనందరాజు జాబువ్రాసినట్లు
దొంగజాబు వ్రాసినాడు పాపారాయుడు
జాబును లకోట జేసినాడు పాపారాయుడు
సేవకునిచేత నిచ్చెను జాబును యపుడూదా
పరాకుంచక వినుమయిపుడు మిరియాల శీతన్నా
అటకాయింపు లేకుండానే దేరాకు పోతేను
రాజుకొలువున జాబులుపెట్టి వందన మొసగండి
జాబుకుజయిన నేనున్నాను మిర్యాల శీతన్న
ప్రొద్దుగ్రుంకా జామ్రొద్దు అప్పుడేయున్నాది
అలసిసొలసి నిద్రపోతారు రాజులరందుదా
దిగులుతీరి నిద్రించినాడు విజయరామరాజు

